# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

136 మాసపత్రిక ఫిబ్రవరి 1983





నిర్వహణ

'సాహితీమిత్రులు'

సంవత్సర చందా రు. 20 ఈ సంచిక రు. 2

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22 9-1967.

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu' Printed at Navatha Printers J. P. N. Road, Warangal - 506 002 for Venkataramana Mudranalayam, Warangal

Working Editor : Varavararao


ఇంద్రవెల్లి గిరిజన మృతవీరుల కుటుంబాలకు, కాల్పుల్లో గాయపడిన వారికి ఆదిలాబాద్ గిరిజన సహాయనిధి కమిటీ డిసెంబర్ 11, 12 తేదీలలో యిరువైవేల

# పదిరికుప్పం - పాతనగరం

పదిరికుప్పంలో ఇందిరా కాంగ్రెస్‌కు ఓటువేసిన హరిజనుల గుడిసెలను తెలుగుదేశంపార్టీ కార్యకర్తలు కిరోసిన్‌పోసి తగలబెట్టారని, బెల్చిని తలపింపచేసే దారుణ మారణకాండ జరిగిపోయిందని ఇప్పుడు ప్రతిపక్షంగామారిన ఇందిరా కాంగ్రెస్ కాలిపోయిన ఇళ్ళను ఇందిరమ్మవచ్చి చూసేదాకా అలాగే వుంచిచూపాలని దానొక రాజకీయసమస్యగా మార్చింది. (కిలవెన్మణిలో హరిజనులను సజీవంగా దహనంచేసింది, ఇంద్రవెల్లిలో గిరిజనులను కాల్చిచంపింది ఇందిరాకాంగ్రెస్ ప్రభుత్వహయాంలో లేదా స్వయంగానన్నది ఇందిరాకాంగ్రెస్ తనఅవసరంకొరకు మరచిపోయింది.) సిద్దిపేటప్రాంతంలో హరిజనులపై జరిగిన అత్యాచారాలగురించి తెలుగుదేశంపార్టీ అధికారంలోకివచ్చాక వరుసగా ఇది ఏడవదౌర్జన్యం అన్నాడు మదన్‌మోహన్. ఆంధ్రప్రదేశ్‌లోనయినా, బీహార్, ఉత్తరప్రదేశ్‌లలోనయినా, దేశంలో ఏమూలనయినా హరిజన, గిరిజన, బలహీనవర్గాల ప్రజలపై ఏపార్టీ లేదా పార్టీలు దౌర్జన్యం చేస్తున్నాయిఅని విశ్లేషణలోకిపోతే అన్నిపార్టీల హయాంలోనూ ఆయాపార్టీల పరిపాలనా కాలవ్యవధినిబట్టి వాటివాటి పాత్రఎంతో లెక్కగట్టడం అంత కష్టంకాదు. అదిఅంతముఖ్యమూకాదు. పార్లమెంటరీ రాజకీయాల్లో ఎన్నికలద్వారా అధికారంలోకివస్తున్న పార్టీలన్నీ భూస్వామ్య బూర్జువావర్గాలకు ప్రాతినిధ్యంవహించే పార్టీలే. కనుక అది కాంగ్రెస్‌పాలనఅయినా, జనతారాజ్యమైనా, తెలుగుదేశం ఏలుబడిఅయినా పెత్తందార్లు బలహీనవర్గాలపై తమఅణచివేత విధానాన్ని యధావిధిగా యథాశక్తిగా కొనసాగిస్తున్నారని, ఇరువర్గాలుగా చీలిపోయి కలహించుకొని, దాడులు చేసుకొని చంపుకుంటున్న జనం ఏ అట్టడుగువర్గాలనుంచి వచ్చినవాళ్ళైనా వాళ్ళు ఈ దోపిడీవర్గాలకు పావులుగా ఉపయోగపడుతున్నవాళ్ళేనని గ్రహించడం కష్టంకాదు. హతులపై, బాధితులపై, తాడితులపై, పీడితులపై అది పదిరికుప్పమైనా పాతబస్తీ అయినా ఎవరికీ సహజమానవ ఆవేదనలేదు. అన్నిపార్టీలకూ అదొక రాజకీయ ప్రయోజనం. అధికారంలోవున్నపార్టీ 'న్యాయవిచారణ' ప్రకటించి, నష్టపరిహారం పంచి, అధికారపర్యటనలుచేసి సానుభూతిపొందే ప్రయత్నం చేయవచ్చు. ప్రతిపక్ష పార్టీ హఠాత్తుగాఏర్పడిన ప్రేమతో గుండెలుబాదుకోవచ్చు. ఏ ప్రకటనలుచేసి, పర్యటనలుచేసి ఎన్ని ఉద్రేకపూరిత ప్రసంగాలుచేసినా ఎన్టీఆర్‌కో, మదన్ మోహన్‌కో మడతనలిగిందీలేదు మాలమాదుగుల బతుకుల్లో పొగలుచల్లారిందీలేదు. ఉప్పెనకాలంలో శవాల బేహారులు బయల్దేరినట్లుగానే పదిరికుప్పం మంటల్లో పేలాలు ఏరుకొని తినాలని అన్నిపార్టీల స్వార్థపరశక్తులూ పోటీపడుతున్నాయి.

పదిరికుప్పం సంఘటనకు ఏపార్టీది బాధ్యత అనేది ఎంత అర్థరహితమైన ప్రశ్నో పాతబస్తీలో పరస్పర హత్యాకాండకు ఏమతానిది బాధ్యత అన్నదికూడ సమస్యను

అంతగానే పక్కదారి పట్టించే ప్రశ్న- ఎన్నికల సమయంలో హైదరాబాదు నగరం పాతబస్తీలో ఏడాదికోసారి రగిలే 'మతకలహాలు' మరింత ఉధృతంగా సెగలెగజిమ్మాయి. రజాకార్ దురంతాల రోజుల్లో సెక్యులర్ భావాలు ప్రచారంచేసిన నేరానికిపోయి బుల్లాఖాన్ వంటి ప్రముఖ పత్రికారచయితలను హత్యచేసినట్లుగా అభ్యుదయభావాలు గల రచయిత గులాంయాసీన్‌ను, ఆయన భార్యను, కూతురును కూడ చంపివేసారు 'మతోన్మాదులు'. అయితే ఈ 'మతోన్మాదం' అనేది ఒక నిషా. ఈ నిషాను సామాన్యజనం తలకెక్కించేవి దోపిడీవర్గాలు. ఈ దోపిడీవర్గాలదేమతం? దోపిడీమతం. పోలీసులది 'ఖాకీమతం' అని గతంలో ఎం.వి. నారాయణరావు చెప్పినట్లుగా దోపిడీ వర్గాలకు తెలిసిన భాష, కులం, ప్రాంతం, మతం, రాజకీయం ఏమిటయ్యాఅంటే అది దోపిడియే. అది దేశకాలపాత్రలనుబట్టి ఆయాప్రాంతాల్లో ఆయాకాలాల్లో ఆయా పరిస్థితులనుబట్టి కులమో, మతమో, భాషో, పార్టీయో ఏది అనుకూలమైతే దానిని ఆశ్రయించుకొని వస్తుంది. ప్రజలుగా, కష్టజీవులుగా జీవన సమరంలో పాల్గొంటున్న అసంఖ్యాక సామాన్యజనం కులమతాలకు, భాషాభేదాలకు అతీతంగా ఒకరి కష్టసుఖాల్లో ఒకరు పాలుపంచుకోవడం మానవ నైజంగానూ, సామాజిక ధర్మంగానూ సాధారణంగా నిర్వహించబడేవే. ప్రజల, కష్టజీవుల ఐక్యత దోపిడీవర్గాలకు అన్నిటికన్న పెద్ద అవరోధం. ఈ ఐక్యతను కులమతాలవంటిమత్తు మాటలతో చెప్పగొడితే తప్ప వీళ్ళకు నూకలుపుట్టవు. వీళ్ళనాశ్రయించి శ్రమ కష్టాన్ని ఆశ్రయించడం మానుకున్న కిరాయి గూండాలకు గుడుంబా అవసరమో, అంతకన్న తాము బానిసలైపోయిన మరిన్ని విలాస వినోదవ్యసనాల ఒత్తిడియో ఎప్పుడినపుడల్లా గుడిసెలు కాలుతూనేవుంటాయి, ఇళ్ళు కూలుతూనేవుంటాయి. దాడులుజరుగుతూనే వుంటాయి, అమాయకప్రజల ప్రాణాలు పోతూనేవుంటాయి. దోపిడీ నిజరూపం చూపి పోరాటం నేర్పలేనివాడు, చేయలేనివాడు, అదివేస్తున్న ఎన్నిమారాకులకు, మారువేషాలకు అసలు మందు వివరించలేక, విశ్లేషించలేక, గ్రహించలేక దానికి దాసోహమనడమో, దానిదౌర్జన్యానికి భయపడి లొంగిపోవడమో, సమన్వయించిపారిపోవడమో చేస్తూనేవుంటాడు. అంతకాలం నిజానికి వేళ్ళమీద లెక్కపెట్టడానికి కూడ చాలనంతమందివున్న ఈ దౌర్జన్యకారుల దురంతాలు అశేష మానవప్రజానీకం జీవితాలమీద భయంనీడలను కప్పుతూనేవుంటాయి. అంతేకాదు ప్రజలమధ్య వైరుధ్యాలను విద్వేషాలను రెచ్చగొట్టదలచుకున్న దోపిడీవర్గాలకు దారిసుగమం చేస్తాయి. ఏమతం ప్రవచనాలు చేస్తేనేమిటి రాబందుల భాష శవాలను తినడమనేది చరిత్ర చెప్పిన సత్యం.

# దుశ్శాసనులు

పేదప్రజలమధ్యన పేదప్రజలకొరకు రైతాంగ ఉద్యమంలో పనిచేస్తున్న కామ్రేడ్ రామారావును భూస్వాములు, వాళ్ళ తాబేదారులు (వీళ్ళు గ్రామీణపేదల తరఫున విప్లవపదజాలం వల్లిస్తున్నారని ఆరోపణలు వినొస్తున్నాయి.) వరంగల్ జిల్లా ఘనపురంతాలూకా పీచర గ్రామంశివార్లలో హత్యచేసారు. రెండుసంవత్సరాలుగా తనకొడుకు రహస్యజీవితం గడుపుతూ తనకు జాడతెలియక తనకొడుకు ఎంచుకున్న రాజకీయాలు ప్రభుత్వానికీ, దొరలకూ ప్రాణాంతకమైనవిగనుక తనకొడుకు ప్రాణాలతో బయటపడటం కష్టమని ఇరుగుపొరుగులు అనుకుంటే పరిసరప్రాంతాల్లో ఎక్కడ ఏ యువకునిపై అఘాయిత్యం జరిగిందనివిన్నా ఆతల్లికి పీడకలలో పేగుకదిలేది. భర్తలేదు, కాజీపేట డీజల్ కాలనీలో ఒంటిపొట్టపోసుకుంటున్నది. తనకొడుకును ప్రాణాలతోకాకున్నా గాయాలతోనో, భౌతికకాయంలోనో కడసారి చూసుకోవాలన్న మమకారంతప్ప ఆతల్లికి రాజకీయాలులేవు. ఆమెనెవ్వరేపేరుతోపిల్చినా ఈదేశంలో కష్టజీవులైన అందరుతల్లుల్లాగే ఆమెకొంరమ్మ. కొడుకుశవమైనా కడసారిచూసి, రోజులుగడిచి శవంశిథిలమైతే అస్థికలైనాతెచ్చుకొని తనబిడ్డకు దహనంచేసుకుందామని, తానెంతపేదరాలైనా తనకొడుకుఎంత అజ్ఞాతవ్యక్తయినా అతనిది కుక్కచావుకాకూడదని ఆవేదనతో ఆమె పీచరకుపోయింది. ఆమెవెంట మరో అయిదుగురు కష్టంచేసుకునే స్త్రీలువెళ్ళారు. అందులో రామారావుభార్య, ఇరవైఏళ్ళయినా నిండనిప్రాయం. ఆమెకు రెండేళ్ళపాప. తల్లి, భార్య ప్రయాణంచేసి, బాటలునడిచి, కొడుకుబొంద దగ్గరికిపోతే పంచనామా (పోస్టుమార్టమ్) అయిన పూడ్చినశవాన్ని తీయనిచ్చినోడెవడో ఇప్పుడాశవం ఏస్థితిలోవుందో. అన్నిటికన్నా న్యాయ, చట్ట విచికిత్సలకన్నా తమ రక్తంలోరక్తం ప్రాణతెగి, చలనమాగి ఆమట్టిలో భద్రంగా నిద్రపోతున్నాడో. ఛిద్రమయి నామరూపాలులేకుండా కనిపించిపోయాడో తెలియనిదుఃఖం పొంగినకన్నీళ్ళ తెల్లవిదుట చేతుల్లోలాఠీలతో, తుపాకులతోపోలీసులు, అమీన్‌సాబ్ (ఎస్ఐ)నుంచి పిలుపు. ఎవరిఅనుమతితీసుకొని ఈ ఊరికి. బొందదగ్గరికి వచ్చినట్లు? ఎవరు చెప్పారు? ఎవరు తీసుకవచ్చారు? తల్లీ, భార్యా, వెంటవున్న స్త్రీలఅరెస్టు. నీకొడుకు నెవరో చంపారు. దర్యాప్తు చేస్తున్నామని చెప్పడానికి కాదు. నీ కొడుకు శవాన్ని పోస్టుమార్టమ్‌చేసి ఒప్పగిస్తామని చెప్పడానికి కాదు ఆశవం ఎవరిదో గుర్తుతెలియడం లేదు, నీ కొడుకుదని గుర్తించగలవా అని మర్యాదగా అడగడానికికాదు హంతకుడెవరైనా హతుని తల్లి, భార్య ఈ దేశంలో 'ఆత్మగౌరవం' గల ఏనేరమూచేయని స్త్రీలని, వారలని గుర్తించి సానుభూతి చూపడానికికాదు, సంతాపం తెలపడానికికాదు, నీ కొడుకేనని, నీ భర్తేనని ఎవరు చెప్పారు? మిమ్ములను ఎవరిక్కడికి తీసుక వచ్చారు?- ఆనోటా, ఆనోటావిన్నాం. ఊరంతా కాగితాలు అంటించారట. నలుగురు

కూడిన చోటల్లా చెప్పుకుంటున్నారు. ఇటువంటి వార్త విన్నప్పుడల్లా కీడెంచినట్లుగానే అతిస్నేహం ప్రమాదాన్ని శంకించినట్లుగానే అక్కడికి వెళ్ళారు. పోలీసులకు కావలసింది హతుని వివరాలు కాదు (ఆ వివరాలు పూర్తిగా తెలిసి 'ఎన్‌కౌంటర్' బదనామీ లేకుండా కామ్రేడ్ రమణ 'పీడ విరగడయినందుకు' పోలీసులు విందులు చేసుకున్నారు. అతని తల్లీ భార్యలను అరెస్టుచేసి బూతులు తిడుతూ చిత్రహింసలకు గురిచేసిన పోలీసుస్టేషన్‌లోనే మరొకపక్కన విందుభోజనాలు తయారయ్యాయి. అమానుషత్వానికి మారుపేరు ఈ వ్యవస్థ) అతని అడుగుజాడల్లో నడుస్తూ అతని హత్య ఆచూకీని, శవం ఆనవాలునూ తెలుసుకోవాలని ప్రయత్నిస్తున్న రాడికల్స్ వివరాలు సానుభూతిపరుల చిరునామాలు వాళ్ళకు కావాలి.

ఆ తల్లిని కొట్టరానిచోట్ల కొట్టారు. అతని భార్యను తిరిగిచెప్పరాని బూతులు తిట్టారు. గోడకు చేతులు ఆన్చి శరీరమంతా హూనమయ్యేలా హింసించారు. ఆమె భర్త నెత్తుటిమరకల బట్టలు చూపారు. ఆమె గుర్తించింది. అయినా భర్తను పోగొట్టుకున్న ఒక యువతిపై పోలీసులకు సానుభూతి ఏర్పడలేదు. ఒక స్త్రీ పరిపాలిస్తున్న దేశంలో, ఏ స్త్రీ మానప్రాణాలకు అవమానమూ, ప్రమాదమూ జరిగినా సహించనని, అందరి ఆత్మగౌరవాలను నిలబెడతానని అభయమిచ్చి అధికారానికి వచ్చిన తెలుగుదేశం పాలనలో, ప్రజలే ప్రజలకు హామీ ఇచ్చుకొని రచించుకున్న గణతంత్ర రాజ్యాంగ అశోకచక్రాంకిత త్రివర్ణపతాకం ఆకాశంలో రెపరెపలాడిన వేకువ మళ్ళీ ఒకసారి ఈ తల్లీ, భార్యలు జెండాగౌరవాన్ని చూడడానికి కాదు తమ రక్తాన్ని పంచుకొన్న మనిషి నెత్తుటిపోలికల్ని గుర్తించడానికి పోలీసుస్టేషన్‌కు పిలిపించబడ్డారు. తిట్లు అవమానాలు కాకపోతే ఈ దేశం పోలీసుస్టేషన్‌లలో అనాథలు, అసహాయులు ఆత్మగౌరవాన్ని పొందగలరా? ఈ మాట అడగడం కూడ ముఖ్యమంత్రికి 'శాంతిభద్రతలు' కాపాడే అధికారుల విధుల్లో జోక్యం చేసుకోవడంగానే కనిపిస్తుందా?

కూడు, గూడు, గుడ్డ ఇస్తావో ఇవ్వవో అది పెద్దఆశ. పిల్లలకు రొట్టె ఇస్తావో, పేదలకు రెండు రూపాయలకు బియ్యమిస్తావో, అవినీతిని, లంచగొండితనాన్ని రూపుమాపుతావో అవి పెద్దమాటలు. తమ నెత్తుటిపేగు తెగిపోతే ఏదీచూపమని ఆ రక్తబంధువులు అడిగితే, పోనీ మా విశ్వాసాల ప్రకారం తెగిపోయిన మా బంధాన్ని స్మరించుకుంటాం అని ఆ రక్తబంధువులు అడిగితే కుళ్ళి వాసనకొడుతున్న నెత్తుటి గుడ్డల్ని మొహాన విసిరిన ఈ పోలీసు వ్యవస్థలో పురాణాల్లోని దుశ్శాసనులు కూడ సిగ్గుతో చేతులు వెనక్కి తీసుకుంటారు రావణులు పదులతలలూ వంచుకుంటారు.

3-2-83

— సంపాదకుడు

# నాటక ప్రయోజనం - అధ్యయనపద్ధతి

త్రిపురనేని మధుసూదనరావు

గతానుగతికమైన ఆలోచనావిధానంనుంచి బయటపడకపోతే కొత్తవస్తువులని గురించికానీ కొత్తఅంశాల్ని గురించికానీ అన్వేషణచేయలేం.

మన విద్యావిధానం పాశ్చాత్యదేశాల అవసరాలకి అనుగుణమైంది కావటంవల్ల, మనదేశం ఇప్పటికీ ప్రధానంగా వ్యవసాయికదేశం కావటంవల్ల మనఆలోచనావిధానంలో వలసతత్వం, సంప్రదాయికత పేరుకుపోయివున్నాయి. వీటిని వదిలించుకోలేకపోతే చిలకపలుకులు కొంగజపాలుమాత్రమే మిగులుతాయి. మనం వెనకబడి పోతున్నాం అనేబాధలేకుండా వెనకబడివుండటమే గొప్పసంస్కృతిగా చెప్పుకోవటం సిగ్గుమాలినపని. మన వ్యక్తిగత జీవనోపాధికి, సమాజంలో ప్రతిష్ఠపెరగటానికి పనికివస్తున్నవి కదాఅని వాటినే ఉన్నతవిలువలుగా ప్రచారంచేయటం లోకవంచన. సామాజికబాధ్యత స్వీకరించని మేధావి నిరక్షరాస్యునికన్నా గొప్పవాడిని అనుకోవటం ఆత్మవంచన.

ఈనాటివరకూ అభివృద్ధిపొందిన విజ్ఞానాన్ని జీవితరంగాలకి అన్వయించి అధ్యయనం చేయనివాడు విద్యావంతుడని గుర్తింపుపొందటానికి మనవ్యవస్థలోని లోపాలేకారణం. ఏ విషయాన్నిగురించి అయినా బహుముఖంగానూ, శాస్త్రీయంగానూ పరిశోధించటం, సమస్యని అవగాహనచేసుకొని ఆచరణలో పరిష్కరించటానికి ప్రయత్నంచేయటం ఈనాటి మేధావులకర్తవ్యం. ఒకవిషయం పరిశోధనలో, అనుభవంలో తప్పుఅని, అసమగ్రమని తేలిపోయినప్పుడుకూడా దాన్నేపట్టుకువేలాడటం ఎందుకు? తన ఆలోచనల్లో స్వేచ్ఛని నిలబెట్టుకోలేనివాడు తన ఆలోచనాఫలితాల్ని ఆచరించటానికి వెనకడుగువేసేవాడు విద్యావంతుడుకాడు. సొంతప్రయోజనాల పరిమితుల్లో బతికే స్వార్థపరుడు. సాంస్కృతికరంగంలో ఇలాంటి స్వార్థపరులసంఖ్య ఎక్కువగావుండటం విచారకరం.

నాటకంఅంటే ఏమిటి? దేనికీనిర్వచనాలువుండవు. ప్రతిదాన్నీ నిర్వచించాలనే ప్రయత్నం వస్తుస్వరూపజ్ఞానాన్ని దెబ్బతీస్తుంది. ప్రపంచంలో ఏదీ నిర్వచనాల్లో ఇమడదనీ, అవసరం అనుకున్నప్పుడు నిర్వచనాల్ని సవరించుకోవాల్సివస్తుందనీ, ప్రతినిర్వచనం అసమగ్రమేనన్న స్పృహతో నిర్వచనాలు చెయ్యటంవల్లనష్టం లేకపోవచ్చు. వస్తువుల సారాంశాన్ని సామాజికంగానూ, చారిత్రికంగానూ పరిశీలించే శాస్త్రీయ పద్ధతికి నిర్వచనాలు అవరోధంకాకుండా చూసుకోవాలి. సార్వకాలిక, సార్వ-

జనిస. శాశ్వత నిర్వచనాలకోసం ప్రయత్నం చేయటంఅంటే మనకిమనం సత్యాన్వేషణని నిరాకరించినట్టే. ప్రకృతిలో, సమాజంలో ప్రతీది నిరంతరం మారుతూ వుంటుంది. చలనరహితమైన వస్తువు ప్రపంచంలో వుండదు. ప్రకృతీ, సమాజమూ-రెండూమారుతున్నప్పుడు ఆరెంటికీసంబంధించిన మనిషి చైతన్యం మారకుండా ఉండదు. వస్తువులకు సంబంధించి శాశ్వతనిర్వచనాలు చెయ్యటం ఈ మార్పుని గుర్తించకపోవటమే. మనం గుర్తించినా గుర్తించకపోయినా, మనఇష్టాయిష్టాల్తో నిమిత్తంలేకుండానే చలనసూత్రం పనిచేస్తూనేవుంటుంది.

నాటకంఅంటే ప్రదర్శించేకళారూపం. ఈనిర్వచ్యంలో ప్రదర్శన, కళఅనేది దేశకాలాన్నిబట్టీ సామాజిక వ్యవస్థనిబట్టీ భిన్నంగావుంటాయి. అంటే సమాజంలోనూ, ప్రకృతిలోనూ వచ్చేనిరంతరమైన మార్పులకి అనుగుణ్యంగా ప్రదర్శన స్వరూపం, కళాస్వరూపం మారుతూవుంటాయి. అన్నికాలాలకీ, అన్నిసమాజాలకీ అన్వయించే ప్రదర్శనకానీ, కళకానీ వుండవని దీన్నిబట్టి మనంనిర్ణయానికి రావచ్చును. నిర్దిష్ట (Concrete) ప్రదర్శన, నిర్దిష్టకళవుంటాయి కానీ అనిర్దిష్ట (abstract ప్రదర్శన, సామాన్యకళ వుండవు. ప్రదర్శన కళనిర్దిష్టంగా వున్నప్పుడు నాటకంకూడా నిర్దిష్టంగానేవుంటుంది. సాధారణనాటకం (Drama in general) వుండదు. 'నాటకం' అని మనంఅంటున్నాం అంటే ఒకనిర్దిష్ట సామాజిక చారిత్రిక దశలో ఒక భాషలోరాసిన లేదా చెప్పిన ప్రదర్శన కళారూపం అనిఅర్థం. నాటకం ప్రదర్శకకళ అనేదాన్ని నిర్వచనంగాకాక నిరంతర చలనశీలసూత్రంగామాత్రమే స్వీకరించాలి. 'సూత్రం' అంటే మనిషిమెదడులోని బాహ్యవాస్తవికత ప్రతిబింబమని అర్థం.

నాటకం సామాన్యంగా వుండనట్టే నాటకప్రయోజనంకూడా సామాన్యంగా వుండదు. 'ప్రయోజనం' అనేమాటకి ప్రస్తుత సమాజవ్యవహారంలో గౌరవప్రదమైన అర్థంలేదు. 'లాభం' అనే అర్థికపరిభాషలో మాత్రమే అవగాహన చేసుకోవటం జరుగుతోంది. కానీ ఇక్కడ 'ప్రయోజనం' అంటే Function. అని అర్థం దీన్నే మరొకమాటలో చెప్పాలంటే, నాటకం నిర్వహించే సామాజికపాత్ర అనవచ్చును. నాటకప్రయోజనాన్ని పరిశీలించాలంటే నాటకంపుట్టుకనీ, వికాసాన్నీ పరిశోధించాలి. ఎందుకనంటే ఏదోఒక ప్రయోజనం లేకుండా ఏదీపుట్టదు. పుట్టినా పెరగదు. సామాజిక ప్రయోజనం అంటే సమాజంలో ఎలాంటి పాత్రలేనిది అయితే, నాటకం ఇంతకాలం ఇన్నిసమాజాల్లో ఇన్నిరూపాల్లో, వుండేదికాదు.

మానవశరీరంలో మొత్తం శరీరయంత్రాంగానికి అవసరంలేని అనేక అవయవ అంశాలు పరిణామక్రమంలో కృశించి కరిగిపోయాయి. ప్రకృతిలో వునికిలో వుండిన, దుర్బలజీవరాసులు అనేకం అదృశ్యం అయిపోయాయి. అలాగే సామాజిక అవసరం లేనివి కూడా క్రమంగా అంతం కావడం జరుగుతుంది. సామాజిక జీవితంతో పాటు మారుతూ పురోగమిస్తూ ఈనాటికీ వున్నదంటే నాటకానికీ, జీవితానికీ అవిభాజ్యమైన సంబంధం వుందని గ్రహించవచ్చు. జీవితానికి ఎలాంటి వుపయోగం లేనిదీ, చాలా అల్పమైన ప్రయోజనం కలదీ అయితే ఇంతటి సుదీర్ఘచరిత్రలో నిలిచి వుండదు. జీవితంలో వచ్చిన పెనుమార్పుల్తో మారుతూ వుండదు. నాటకం జీవితంలో నిర్వహించే పాత్రని కూడా నిర్దిష్టంగానే పరిశీలించాలి. ఎప్పుడూ ఒకేవిధమైన పాత్ర నిర్వహించేది అయితే, జీవితం మారినప్పుడు దానికి కాలదోషం పట్టుతుంది.

నాటకప్రయోజనం 'ఆనందం' అనీ, అదే సార్వకాలిక, సార్వజనీన ప్రయోజనం అనీ చెప్పటం పూర్తిగా తప్పుడు సిద్ధాంతం. ఆలోచనతో క్రమబద్ధం చేయబడిన భావావేశాన్ని ఆనందం అంటారు. మెదడుని ఆవేశ చైతన్యంతో ఒక ఆలోచనమీద కేంద్రీకరింపచేయటంవల్ల నాడీమండలం పొందే సంచలనం ఆనందం. నాటకంలోని ఆలోచనల్తో నిమిత్తం లేకుండా ఆవేశం వుండదు. ఆవేశం లేకుండా ఆనందం వుండదు. ఆలోచనతో ఎంతగా క్రమబద్ధం చేయబడుతుందో అంత గాఢంగా ఆవేశరూపమైన, ఫలితమైన ఆనందం సామాజిక చైతన్యాన్ని విస్తరింపచేస్తుంది. కళ అంటేనే ఆవేశాన్ని నిపుణంగా వ్యక్తంచేయటం కాబట్టి ఆనందాన్ని నాటకప్రయోజనంగా గాక అందులో ఒక భాగంగానే పరిగణించాలి. ఆవేశం రచయిత అంతరంగంలోనుంచి సహజంగా పుట్టేదికాదు. పరిసరాల్తో సంబంధం నుంచే పుడుతుంది. కాబట్టే ఆవేశం, ఆనందం రెంటికీ కూడా రచయితకీ సమాజానికీ, రచయితకీ ప్రేక్షకుడికీ అన్యోన్య సంబంధం వుంటే వుంటాయి. అవీ నిర్దిష్టంగానే వుంటాయి. ఆలోచనల్తో, భావాల్తో, సిద్ధాంతాల్తో సంబంధంలేని 'ఆనందం' విడిగా వుంటుందనుకోవటం ఒక పెద్దభ్రమ. ప్రాచీన భారతీయవిమర్శకులు అందరూ దాదాపు 'నియతికృత' 'నియమరహిత'మైన ఆనందనిష్యందమని నాటకపరమప్రయోజనంగా భావించి చెప్పిపోయిన వాళ్ళే. అల్పమైన వుత్పత్తి, పరిమిత మానవ సంబంధాలూ, పాలకవర్గాల సంకుచిత వర్గీకరణ మనస్తత్వమూ, నాటి మేధావుల భ్రమలకి ప్రధానకారణాలు.

ప్రదర్శన కళగా నాటక ప్రయోజనాన్ని అధ్యయనం చెయ్యాలంటే చారిత్రక

మైన, సామాజికమైన అన్యోన్యతా వాదకోణంనుంచి చెయ్యాలి. ప్రపంచంలో పూర్తిగా భిన్నంగావుండే రెండువస్తువులు వుండవు. పూర్తిగా ఒకేవిధంగావుండే రెండు వస్తువులు వుండవు. ఏవస్తువు మరొక వస్తువుతో సంబంధంలేకుండా మనదు. ప్రతివస్తువూ ఇతర అనేక వస్తువుల్తో అన్యోన్యసంబంధంలో వుండటం వల్లనే పుట్టిపెరిగి మారుతూ సాగుతుంది. ఇది భౌతిక వస్తువులకీ, భౌతికేతర చైతన్య రూపాలకీ కూడా వర్తిస్తుంది.

నాటకం అనేది స్వతంత్రమైంది కాదు. స్వతంత్రప్రతిపత్తి దేనికీవుండదు. నాటకానికి స్వతంత్ర చరిత్ర రాయటం అంటే దాని మరణచరిత్ర రాయటమే. మన పండితులు రాసిన నాటక చరిత్రలు అన్నీ నాటకాల మరణచరిత్రలో, లేకపోతే పండితుల చైతన్యంలో పరివర్తనా రూపంలోవున్న నాటకాల చరిత్రో, కాని వాస్తవనాటక చరిత్ర కాదు. నాటకం తన నుంచీ తానేపుట్టి తానుగానే పరిణతిచెంది ఒక సామాజిక పాత్ర నిర్వహిస్తుందనుకోవటం హాస్యాస్పదం. నాటక ప్రయోజనాన్ని నాటకం నుంచి మాత్రమే పరిశీలించి నిరూపించలేం. నాటకం సామాజిక చైతన్యరూపం. చైతన్యాన్ని సామాజికజీవితానికి బాహ్యంగా విశ్లేషించలేం; అవగాహన చేసుకోలేం. చైతన్యం తొలినుంచీ సామాజికవుత్పత్తి. మానవులు అస్తిత్వంలో వున్నంతకాలం చైతన్యం సామాజికవుత్పత్తిగానే వుంటుంది, భాషలో, విజ్ఞానశాస్త్రంలో, తత్వశాస్త్రంలో, సాహిత్యకళారంగంలో, భావజాలంలో, మతంలో, ఆచారవ్యవహారాల్లో వ్యక్తమయ్యే సామాజిక జీవిత సంకీర్ణ ప్రతిబింబాన్ని 'సామాజికచైతన్యం' అంటారు. చైతన్యం సమాజంనుంచి పుట్టి సమాజాన్ని ప్రభావితంచేస్తుంది. సామాజికచైతన్యం వ్యక్తిగతమైందికాదు. ఒక నిర్దిష్ట సమాజానికి, లేదా సామాజికవర్గానికి సంబంధించిన భావాలు, అభిప్రాయాలూ, వ్యక్తిచైతన్యానికీ సామాజికచైతన్యానికీమధ్య నిరంతర అన్యోన్యక్రియ వుంటుంది. అందువల్లనే సామాజిక జీవితంనుంచీ, సామాజిక చైతన్యంనుంచీ ఏర్పడిన వ్యక్తిచైతన్యం సామాజిక విలువనిపొంది సామాజిక చైతన్యంలో బలమైనశక్తిగా రూపొందుతుంది. ప్రతిదీ ఒకమొత్తంగా (Whole)నూ వుంటుంది. ఒకదానిలో భాగంగానూ (Part) వుంటుంది. నాటకం ఒకమొత్తం. సాహిత్యంలో నాటకం ఒకభాగం. కళ ఒక మొత్తం. సాహిత్యం కళలో ఒకభాగం. కళ, తత్వశాస్త్రం రాజకీయాలు, మతం మొదలయినవి సంస్కృతిలో ఒక భాగం. సంస్కృతీ దానికిమూలంగావుండే ఆర్థికపునాదీ కలిసి సామాజికవ్యవస్థ. ఇలాంటి సామాజిక వ్యవస్థారూపంలో భాగంగానే నాటక ప్రయోజనం వుంటుంది. నిర్దిష్ట

సామాజిక వ్యవస్థ అనే అంగిలో అంగంగానే నాటకం తన సామాజిక పాత్రని నిర్వహిస్తుంది.

ఫలానా సమాజంలో ఫలానా కాలంలో నాటకం లేదు అనే సిద్ధాంతం తప్పు. ప్రాచీనాంధ్ర సాహిత్యంలో నాటకాలులేవు అనే పండితుల అభిప్రాయం, వాళ్ళ ఆలోచనా విధానంలోవున్న లోపఫలితమే కాని వాస్తవం కాదు. సంస్కృత నాటకాలవంటి నాటకాలూ, ఆధునిక నాటకాలవంటి నాటకాలూ లేవు కాబట్టి ప్రాచీనాంధ్ర సాహిత్యంలో నాటకాలులేవని పండితులు సిద్ధాంతం చేశారు. ప్రతి సమాజంలోనూ ప్రతి కాలంలోనూ ప్రదర్శక కళారూపాలు వుంటాయి. ఒక సామాజిక దశలోనే అనేకవర్గాల సాంస్కృతిక అవసరాల్ని సంతృప్తిపరిచే అనేక ప్రదర్శక కళారూపాలు వుంటాయి. ఒక భాష మాట్లాడే సమాజం వునికిలోవుండినప్పటి నుంచీ ఆ సమాజానికి అనుగుణమైన ప్రదర్శక కళారూపాలు వుంటాయి. కాబట్టి ప్రాచీన ఆంధ్ర సాహిత్యంలో కూడా నాటకాలువున్నాయి; వుంటాయి. సమాజాల పునాది అయిన వుత్పత్తిశక్తుల్ని వాటికి అనుగుణంగా వుండే జ్ఞానరంగంలోని వివిధశాఖల్ని వాటి అన్యోన్యసంబంధాల్లో నిర్దిష్టంగా అధ్యయనంచేస్తే నాటకప్రయోజనాన్ని నిర్దిష్టంగా విశ్లేషించవచ్చు. శ్రమ విభజన అంతగాలేని ఆదిమసమాజాల్లో జీవితం నుంచీ చైతన్యం విడిపడివుండదు. ఆహారం కోసం ఆదిమ సమాజ సభ్యులు సమిష్టిగా ప్రకృతితోచేసే పోరాటంలో, వాళ్ళ చైతన్యం అవిభాజ్యంగా వుంటుంది. ఆహార సంపాదనలో వేట వీళ్ళకి ముఖ్యమైన సాధనం. వేటకిపోయేముందు వీళ్ళు వేట క్రమాన్ని అనుకరిస్తూ ప్రదర్శనచేసే వాళ్ళు. ఈ అనుకరణ నృత్యమే నాటకానికి తొలిరూపం. ఈ అనుకరణ కేవలం వినోదం కాదు. వేటలో భాగం వేటను అనుకరిస్తూ ప్రదర్శించటంవల్ల వేటలో సౌలభ్యాన్నీ, ఆత్మవిశ్వాసాన్నీ సాధించేవారు. ఆదిమ ప్రజల వేటని అనుకరణచేస్తూ చేసే ప్రదర్శనని, విడదీయటం సాధ్యంకాదు. ఈ అనుకరణ నృత్యాన్నే "ఆదిమ మాయ" (Primitive Magic) అంటారు. వ్యవసాయం ప్రారంభమైన తర్వాత కూడా ఈమాయ అనేది ఆదిమ ప్రజల సాంఘిక జీవితంలో భాగంగావుంది. వేట నుంచి వ్యవసాయానికి వుత్పత్తి మారిన క్రమంలో ఆదిమ మాయతో కూడిన అనుకరణ నృత్యం సామాజిక జీవితం నుంచి విడివడిన ప్రదర్శక కళగా అభివృద్ధిపొందింది. కాబట్టి అనుకరణ అనేది ఆదిమ ప్రజల్లోనూ, చిన్నపిల్లల్లోనూ మాత్రమే వుంటుంది. నాగరిక సమాజాల్లో అనుకరణ అనేది అధమస్థాయి కళాభాస (Pseudo Art). ఈ విషయాన్ని

గమనించకుండా చాలామంది పండితులు అనుకరణ సిద్ధాంతాన్ని గురించి అసందర్భ చర్చలు చేస్తున్నారు.

"నానాభావోప సంపన్నం
నానావస్థాం తదాత్మకాం
లోకవృత్తాను కరణం
నాట్యమేతస్మయాకృతమ్"

అనే భరతుని వాక్యాల్లోని 'అనుకరణ' మాటని పట్టుకొని ఒక పండితుడు, ప్లేటో అరిస్టాటల్ 'imitation'తో పోల్చి పెద్దరాద్ధాంతం చేశాడు. గ్రీకుల అనుకరణ సిద్ధాంతానికీ భరతుని అనుకరణ శబ్దానికీ ఏమీ సంబంధంలేదు. విభిన్నకాలాల్లో విభిన్న సమాజాల్లోని అభిప్రాయాల్ని కలిపి చర్చించటం అశాస్త్రీయం. భరతుడు చెప్పిన అనుకరణకి అభినయం అని అర్థం. అనేక భావాలతో అనేక అవస్థలతో కూడిన లోకవృత్తాన్ని అభినయించటం నాట్యం అని భరతుని సిద్ధాంతం. ఇదే అర్థాన్ని అవస్థాను కృతిర్నాట్యం" అనే మాటలో ధనుంజయుడు కూడా చెప్పాడు. అనుకరణం, అనుకృతి అనే మాటలకి అభినయం అని అర్థంకానీ imitation అని అర్థంకాదు. భావాలను జీవితావస్థల పరంగా అభినయం చేయటం నాటకం అని భరతుని అభిప్రాయంగా గుర్తించాలి. లోకవృత్తానికీ నాటకానికీ అన్యోన్య సంబంధాన్ని ఈ వివరణ స్పష్టంచేస్తోంది. ఆంగికం, ఆహార్యం, సాత్వికం, వాచికం అనే నాలుగురకాల అభినయాలూ జీవితానికీ నాటకానికీ కూడా అన్వయిస్తాయి. సమాజంలో వ్యక్తుల సంబంధాలూ వ్యక్తుల కార్యకలాపాలూ ఈ అభినయం ద్వారానే వ్యక్తంఅవుతాయి. అభినయం కూడా విర్దిష్టంగానే వుంటుంది. ఈ అభినయం చేసే నటులు గణసమాజ కళాకారుల నుంచి వచ్చిన వాళ్ళు కాబట్టి మొదట్లో వీళ్ళకి చాలా గౌరవం వుండేది. పురోహితుడు - కళ - నటుడు, ఈ ముగ్గురికి సమాజంలో ఒకేస్థానం వుండేది. భరతుడు నటులకీ చాలా పవిత్రమైన స్థానంఇచ్చాడు. అసలు నాట్యశాస్త్రం విభిన్నకాలాల్లో నటుల అభిప్రాయాల సంకలనమే. రససిద్ధాంతం, దశరూపక విభజన, నాట్యశాస్త్రంలో ఎవరో కలిపినవే కానీ అందులో వుండే అవకాశంలేదు. ఆదిమ సమాజంలో నాటకం అవిభాజ్యంగా అనుకరణరూపంలో వుండేదని, వ్యవసాయం బాగాఅభివృద్ధిపొంది శ్రమ విభజన పదునుతేలిన తర్వాత జీవితం నుంచి విడిపడిపోయిందనీ చారిత్రిక సమాజ పరిశోధకుల అభిప్రాయం.

నాగరిక సమాజంలోనే వృత్తి రచయితలూ, వృత్తి నటులూ అభివృద్ధిపొందారు. ఈ సమాజాల్లో రచయితలూ నటులూ మొత్తం సమాజానికిగాక, సమాజంలో ఒక బృందానికో ఒక వర్గానికో సంబంధించిన వాళ్ళుగా వున్నారు. ఆ బృంద జీవితాన్ని అప్రధానంగా నాటకరూపంలో ప్రదర్శించారు. వృత్తిరచయితలూ వృత్తినటులూ ప్రధానంగా, తక్కిన సమాజజీవితాన్ని రాజాస్థానాల్లోనూ సంపన్నుల పరివారంలోనూ చేరటం ప్రారంభించారు. రాచరికవ్యవస్థను చిత్రించి ప్రదర్శించారు. నాటకలక్షణాలూ నాటక ప్రదర్శనశాలలూ నటకుటుంబాలూ అభివృద్ధిపొందాయి. నాటకప్రదర్శన, నాటకకళ, నాటకప్రయోజనం ఒక అధికారబృందానికి పరిమితంకావటంజరిగింది. నాటకానికి ప్రేక్షకులుఏర్పడ్డారు. వాళ్ళనే నాటక పరిభాషలో 'సహృదయులు' అన్నారు. ఈ నాటకాల్లో అధికారవర్గం శాశ్వతం అనీ, రాచరికవ్యవస్థ వున్నత వ్యవస్థ అనీ, రాజులూ పురోహితులూ సైనికులూ దేశంలో ప్రజారక్షకులనీ చెప్పటం జరిగింది. ప్రజాభిప్రాయాన్ని అధికార వర్గానికి అనుకూలంగా మలచటంలో ఈ దశలో నాటక సాహిత్యం బలంగా వుపయోగపడింది. ఈ వర్గ జీవితాన్ని చిత్రించని ప్రదర్శక రూపాల్ని పండితులు ఆదరించలేదు. అసలు వాటిని నాటకాలు కాదు పొమ్మన్నారు. రాజాశ్రితులు గాని నటుల్ని సంఘ బహిష్కృతులుగా అపాంక్తేయులుగా పరిగణించి వాళ్ళ అభినయ కళని దెబ్బతీయటానికి ప్రయత్నం చేసారు. పూర్వం నటులకి గౌరవంలేదనే అభిప్రాయం పూర్తిగా వక్రీకరణ. రాజుల, రాణుల సమక్షాన అంతఃపురంలో రాజాస్థానాల్లో ప్రదర్శించే నటులకి గౌరవం వుండేది. సాధారణ ప్రజల జీవితాన్ని ప్రదర్శించే నటులకీ, శూద్రపాత్రలువేసే నటులకీ గౌరవం ఉండేది కాదు. శూద్రులకీ పంచములకీ సమాజంలో ఎలాంటి గౌరవం వుండేవో, వాళ్ళ పాత్రల్ని అభినయించే నటులకీ అలాంటి గౌరవమే వుండేది. దశరూపకాల్లో ప్రధాన ప్రదర్శన ప్రక్రియలు భారతీయ రాచరిక సమాజప్రక్రియలే. అశ్వఘోషుని 'శారీపుత్ర ప్రకరణం' నుంచీ 'ఉత్తరరామ చరిత్ర' వరకూ సంస్కృత నాటకాలు భారతదేశంలోని కేంద్రీకృత భూస్వామిక వ్యవస్థలో అవయవాలుగా వున్నవే. ఆనాటి భారత భూస్వామ్యవ్యవస్థ విలక్షణ గుణాలైన వర్ణధర్మం, అద్వైత వేదాంతం, వేదప్రామాణ్యం, మనుధర్మశాస్త్రములూ, నాటకాలమీద తీవ్రప్రభావం వేసాయి. యుద్ధం, రాజ్యాల మార్పిడికి దారితీసిన రాజుల పెళ్ళిళ్ళు నాటకాలమీద గాఢంగా ప్రభావం వేసాయి. రాజు దివ్యాంశ సంభూతుడనీ, రాజు రక్తంతప్పుచేయదనీ, బ్రాహ్మణుల్ని రాజు గౌరవించాలనీ, స్త్రీ పురుషుని అధీనంలో వుండాలనీ, సంస్కృత నాటకాలు బహుముఖంగా చిత్రించాయి. నాటక లక్షణకర్తలు నాటకకర్తల స్థాయిలో

రచయితల్ని రాచరికవ్యవస్థా చిత్రీణకి నిర్బంధించారు. రాజకీయంగా సంస్కృత నాటకాలు రాచరిక వ్యవస్థనీ ఆర్థికంగా భూస్వామ్య గ్రామీణ వ్యవస్థనీ ప్రతిబింబించాయి. ఆ వ్యవస్థలు ఏమీ లేకపోతే సంస్కృత నాటకాలు అలా వుండేవికావు. ఆనాటి సమాజ వ్యవస్థలో భాగంగా లోతుగా పరిశీలిస్తే, సంస్కృత నాటకాలు నిర్వహించిన సామాజిక పాత్రని విశ్లేషించవచ్చును. భూస్వామ్య రాజకీయాలు లేని నాటకం అంటూ సంస్కృతంలోలేదు.

అయితే సంస్కృత నాటకాలు విలక్షణమైన విషాదనాటకాలు. భారతదేశంలో విషాద నాటకాలు లేవనీ ప్రాచీన గ్రీకు నాటకాల్లో విషాద నాటకాలు వున్నాయనీ చాలామంది పండితులు సిద్ధాంతంచేశారు, చేస్తున్నారు. ప్రాచ్య, పాశ్చాత్య సాహిత్య విమర్శనా సూత్రాల సమన్వయం పేరుతో పండితులు చాలాకాలం నుంచీ సాహిత్య విమర్శని గందరగోళం చేస్తున్నారు. యూనివర్సిటీల్లో చదువుకునే సాహిత్య విద్యార్థుల మనస్సుల్ని దుర్గమారణ్యాలుగా తయారుచేస్తున్నారు. సాహిత్యానికీ సమాజానికీ వున్న చారిత్రిక అన్యోన్యతను విస్మరించి సాహిత్య విమర్శని కలుషితం చేస్తున్నారు. ఈ అశాస్త్రీయ పద్ధతినుంచి ఎంతత్వరగా బయటపడితే అంతమంచిది. (పింగళి లక్ష్మీకాంతం 'సాహిత్యశిల్ప సమీక్ష', కె.వి.ఆర్. నరసింహం 'సాహిత్య దర్శనం', శేషేంద్రశర్మ' 'కవిసేన మానిఫెస్టో' వంటి గ్రంథాలు తెలుగులో సాహిత్య విమర్శకి తీవ్రమైన అపచారంచేసాయి, చేస్తున్నాయి. గ్రీకు విషాదనాటకాల వంటివి భారతదేశంలోనూ, భారత విషాద నాటకాల వంటివి గ్రీకునాటకాల్లోనూ వుండే అవకాశం లేదని స్ఫురించక పోవటం పండితుల ఆలోచనా విధానంలో లోపమే కారణం. సమాజంలో శత్రువైరుధ్యాలు వున్నప్పుడు ఆ సమాజంలో భాగమైన నాటకాల్లో విషాదభావాలు లేకుండా వుండవు. "అర్థోపజీవి నామర్థో, ధృతిరుద్విగ్నచేత సామ్" అర్థోపజీవులకి అర్థాన్నీ, ఉద్విగ్నచేతస్కులకి ధైర్యాన్నీ నాటకం ఇస్తుందని భరతుడు చెప్పాడు. వుద్విగ్నచేతస్కులకి వుపశమనాన్ని ఇస్తుందనేమాటలోనే నాటకంలో విషాదాన్ని గురించిన ప్రస్తావనవుంది. నాటక వస్తువునీ రూపాన్నీ సామాజిక శాస్త్రీయపద్ధతిలో విశ్లేషించకుండా శృంగారం, వీరం అని రససిద్ధాంతాన్ని పట్టుకువేలాడితే నాటకం నిర్వహించిన సామాజిక పాత్రని గుర్తించలేం.

అలంకారశాస్త్రాల్లో చెప్పిన నాటకలక్షణాలు నాటకాన్ని రాయటానికి కానీ, నాటకాన్ని అభినయించటానికి కానీ, నాటకాన్ని చూడటానికికానీ పనికిరావు. భారతదేశంలో ఆనాటి పాలకవర్గాల్లో వైరుధ్యాల్ని పాలకవర్గాలకి విశాల ప్రజానీకానికి

మధ్యవుండిన వైరుధ్యాల్ని సంస్కృత నాటకాలు వ్యాఖ్యానించాయి. సంఘర్షణ, విషాదములేని సంస్కృత నాటకం ఒక్కటికూడా లేదు. భాసుని 'స్వప్నవాసవదత్తం', 'ప్రతిమ', 'ఊరు భంగం', 'దరిద్రచారుదత్తం', కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలం', శూద్రకుని 'మృచ్ఛకటిక', విశాఖదత్తుని 'ముద్రారాక్షసం', భవభూతి 'ఉత్తర రామచరితం' వంటి ప్రముఖ నాటకాలన్నీ విషాదనాటకాలే. పురోహితులకీ రాజులకీ ఘర్షణ, రాజ్యాలు కూలిపోవటం, నాయకుని బలవంత సౌఖ్యత్యాగాలను ఈ నాటకాలు విషాద భరితంగా చిత్రించాయి. 'మృచ్ఛకటికం'లో సాంఘిక విప్లవం 'ముద్రారాక్షసం'లో రాజకీయ ఘర్షణ వున్నాయి. కాబట్టి భారతదేశంలో విషాదనాటకాలు లేవనే పండితుల అభిప్రాయం పూర్తిగా అనాలోచితం. వ్యవస్థ పతనాన్ని సూచిస్తే పాలకవర్గ ఆగ్రహానికి గురికావల్సి వస్తుంది. కాబట్టి నాటకాంతంలో శుభాన్ని పలకటం అలవాటుగాపాటించారు. అందుకనే సంస్కృత నాటక అంతాలు చాలా కృత్రిమంగా వుంటాయి.

భారతీయ విలక్షణకేంద్రీకృత భూస్వామ్య రాచరిక వ్యవస్థ పతనంతోపాటు సంస్కృత నాటకంకూడా అదృశ్యం అయిపోయింది. నిర్దిష్ట సమాజవ్యవస్థ పతనం కాగానే ఆ వ్యవస్థలో భాగమైన ప్రదర్శక కళారూపం కూడా క్రమంగానైనా అదృశ్యం అయిపోతుంది. సంస్కృత నాటకాల వంటి నాటకాలను, ఆ నాటకాలకి మూలమైన సామాజిక జీవితం పోయిన తర్వాత, రాయటం సాధ్యంకాదు. ప్రత్యక్షంగా అనుభవంలేని విషయం మీద నాటకం ఎవడూ రాయలేడు.

ఆధునిక యుగంలో వచ్చిన పౌరాణిక నాటకాలు ఆకారంలోనే గానీ, సారాంశంలో సంస్కృత నాటకసంప్రదాయం లోనివికావు. ఈనాటకాల్లో భూస్వామ్య భావజాలం ప్రధానవస్తువుకాదు. జాతివిముక్తి భావాలు ఈపౌరాణిక నాటకాల్లోవస్తువు. 'గయోపాఖ్యానం' వేలాది కాపీలు అమ్ముడయ్యాయంటే, కొన్నివందల ప్రదర్శనలు జరిగాయంటే, దానికి గయుడికథ కారణం కాదు. అందులోవున్న నాటకలక్షణాలు కారణంకాదు. ఆ పాత్రల అనుభవాలవెనక ఆపాత్రల పౌరుష ప్రదర్శన వెనక, ఆపాత్రల సంభాషణల్లోని, పద్యాల్లోని వుత్తేజం వెనక స్వాతంత్ర్య వుద్యమ ప్రభావం తీవ్రతరంగా వుంది. ప్రజల్లో స్వాతంత్ర్య పిపాసను కలిగించటంలో, ఆత్మవిశ్వాసాన్ని రగిలించటంలో, ఈ నాటకాలు జాతీయవుద్యమకాలంలో మహత్తరమైన పాత్రని నిర్వహించాయి. పౌరాణిక నాటకాల్తోపాటు చారిత్రికనాటకాలు కూడా జాతీయోద్యమ ప్రచారానికి దోహదం చేశాయి. అనువాదాలయినా స్వతంత్రాలైనా ఆ నాటకాల్లో ప్రధానశక్తి జాతివిముక్తిభావాలే. ఈనాటకాలు గ్రామీణ ప్రాంతాల్లోకూడా

విరివిగా ప్రదర్శింపబడినాయి. 'శాకుంతలం'లో కందుకూరి కణ్వనిర్వేదన సన్నివేశాన్ని ఇతర అనువాదాలకంటే ఉద్వేగంగా చేయగలగటానికి కారణం సామాజిక ఆవేదనే. వేదం వేంకటరాయశాస్త్రి 'ప్రతాపరుద్రీయం'లో స్వాతంత్ర్యోద్యమ ప్రభావం స్పష్టంగానేవుంది. నాటకకళలో మాత్రమేగాక, ప్రదర్శనలోకూడా, మార్పువచ్చింది. ధార్వాడ, పార్సీ, సురభి కంపెనీలు పోటీప్రేరణతో ఏర్పడిన అనేక నాటకసమాజాలు-నాటకప్రదర్శనలో మౌలికమైన మార్పుని సాధించాయి. మధ్యతరగతి విద్యావంతుల నుంచి నటులు అసంఖ్యాకంగా వచ్చారు. పౌరాణిక, చారిత్రికనాటకాల్నీ అనువాద నాటకాల్నీ జాతీయోద్యమ సందర్భంతో కలిపి పరిశీలిస్తే వాటి సామాజిక పాత్రని విశ్లేషించవచ్చును, జాతీయోద్యమం నుంచి విడదీసి పరిశోధనచేస్తే ఈ నాటకాల ప్రయోజనాన్ని వివరించటం సాధ్యంకాదు. 1947 తర్వాత పౌరాణిక నాటకాలు కాలదోషం పట్టాయి. అంటే అవి నిర్వహించే సామాజికపాత్రకి అవసరమైన పరిస్థితులు మారిపోయాయి. ఆధునిక సమాజతాత్త్వికదృక్పథం సంస్కరణవాదంతో ప్రారంభం అయింది. జాతీయపెట్టుబడిదారీవర్గం ఏర్పడటం: ఆధునిక విద్యావిధానం, సామాజికదృష్టి ఆధునిక సమాజం తొలిస్వరూపాన్ని నిర్ణయించాయి. సమాజంలో సంస్కరణని కోరుతున్న సమస్యల్ని నాటకాలుగా రాయటంతో సాంఘిక నాటకాలు ప్రారంభం అయ్యాయి. 'కన్యాశుల్కం' సంస్కరణవాద నాటకాలకి ఆదర్శంగా నిలిచింది. అనేక సాంఘిక దురాచారాల్ని ఖండించటం ఈ నాటకాల ప్రయోజనం. సంస్కరణవాదం. విమర్శనాత్మక వాస్తవికవాదం. ఆధునికాంధ్ర సాంఘికనాటకాల్లో ప్రధాన భావజాలం. వామపక్షభావాలు (ప్రజాతంత్ర భావాలు) వికసించటంతో సాంఘికనాటకాలూ నాటికలు కేవలం సంఘసంస్కరణని మాత్రమేగాక. సామాజికమైన మార్పుకోసం తపననికూడా చిత్రించాయి. ఆంధ్రనాటక కళాపరిషత్తునుంచి ప్రజానాట్యమండలివరకూ భూస్వామ్య వ్యతిరేక నాటకాల్ని ప్రదర్శించాయి. ఆత్రేయ, సుంకరవంటినాటక రచయితలు సామాజిక సమస్యల్ని బలంగా చిత్రించారు. ఆధునిక సాంఘిక నాటకం, ఆధునిక భారతీయ, ఆంధ్ర సమాజంలో భాగం.

ఈనాటికీ సినిమాల్లో కంటే నాటకాల్లో, నాటికల్లో, సామాజిక సమస్యల్ని శాస్త్రీయంగానూ చైతన్యవంతంగానూ చిత్రించటం జరుగుతోంది. విద్యార్థుల్లోనూ, ఉద్యోగుల్లోనూ నాటకరచన, ప్రదర్శన ఉత్సాహవంతంగా జరుగుతున్నాయి. ఆదిమ సమాజాల్లో నాటకం, ప్రేక్షకులు వేరుగా వుండేవాళ్ళు కాదు. భూస్వామిక సమాజంలో 'సహృదయబృందం' ప్రేక్షకులుగా వుండేవాళ్ళు.

ఆధునిక యుగంలో మధ్యతరగతి 'శిష్ట' బృందం ప్రేక్షకులుగా వున్నారు. ఆధునిక విద్యావిధాన వుత్పత్తి అయిన మధ్యతరగతి మేధావి, బుద్ధిజీవుల బృందానికే ఈనాటి

కీ సాంఘిక నాటకరంగం పరిమితంగా వుంది. వరకట్న సమస్యనుంచీ భూస్వామ్య దోపిడి సమస్య వరకూ సాంఘిక నాటకం, నాటికలూ విస్తృతంగా చిత్రిస్తున్నప్పటికీ, సమస్యల్ని విడివిడిగా అవగాహన చేసుకోవటం కృత్రిమ పరిష్కారాలు ఇవ్వటం జరుగుతోంది. సమస్యల చలనాన్ని సామజిక చారిత్రిక బాధ్యతతో అర్థం చేసుకోవటంలో నాటకరచయితలూ నటులూ విఫలం అవుతున్నారు. పాలకవర్గాల సంస్కరణవాదభావజాల ప్రభావమే ఈ స్థితికి కారణం. మధ్యతరగతి మనస్తత్వంలో భూతకాల దృక్పథంనుంచి వర్తమానాన్ని చూసే ఒకపెద్దలోపం కూడా వుంది. ప్రాచీన చరిత్రలో స్వర్ణయుగాల్ని చూపే పునరుద్ధరణవాదవిషం కూడా రచయితల ఆలోచనా విధానాన్ని దెబ్బతీస్తున్నది. ఆధునిక సమాజ ఆర్థిక, రాజకీయ, నైతిక తాత్త్విక, సమస్యల్ని బహిర్గతం చేసి, మధ్యతరగతి ప్రజలకి సామాజిక స్పృహని కలిగించటంలో ఆధునిక నాటకం తన సామాజిక పాత్రని నిర్వహిస్తున్నప్పటికీ, సామాజిక వాస్తవ వైరుధ్యాల్ని వివరించటంలో వెనుకబడే వుంది. ఇప్పటి తెలుగు నాటకం — నాటిక, పూర్వ కాలంలోగానీ లేనీ, ఇప్పటి సమాజాన్ని చిత్రించేవే. మధ్యతరగతి చేతిపట్టునుంచి నాటకాన్ని విముక్తి చేసి విశాల ప్రజాకోటిజీవితంలోకి తీసుకుపోవటం నేటి రచయితల, ప్రదర్శకుల కర్తవ్యం.

గ్రామీణ ప్రాంతాల్లోని రైతాంగ జీవితాన్ని, ఆ జీవితంలో మేల్కొంటున్న శక్తుల్ని నాటకీకరించాలి. వర్గాల ఘర్షణనీ, నూతన ప్రజాస్వామిక విప్లవపోరాట క్రమాన్ని నాటకం ఆవిష్కరించాలి. నటులు ప్రదర్శించాలి. నాటక దర్శనాన్ని ప్రదర్శించటమే పరిదర్శన. ప్రదర్శనలోకూడా గుణాత్మకమైన మార్పుని సాధించాలి. వృత్తి నటులనుంచి నటనను ప్రజాపరం చెయ్యాలి. నాటకాన్ని జీవితంలోకి, పోరాటాలతో ముందే జీవితంలోకి, నవసమాజం కోసం సంఘర్షణ పడుతున్న శక్తుల్లోకి తీసుకురావాలి. నాటక ప్రయోజనం అప్పుడే అర్థవంతం అవుతుంది. జీవితంకంటే వెనుకబడి రచయితలు వుండ కూడదు. శ్రమజీవులు నాటకానికి ప్రేక్షకులు కావాలి. రచయితకీ ప్రదర్శకులకీ ప్రేక్షకులకీ మధ్య ఐక్యత సాధించాలి. ప్రాచీన యుగాల సాహిత్యంలోని నాటక రూపాలలోకొన్ని, ఈ యుగావసరాలకి దోహదం చేస్తే, వాటినిస్వీకరించవచ్చును. వేల సంవత్సరాలుగా నిరక్షరాస్యులైన శ్రామికుల్లో ప్రచారంలోవున్న ప్రదర్శక కళారూపాల్ని పునరుద్ధరించుకోవాలి. ఆ సంచితాన్ని భద్రపరుచుకోవాలి. "To preserve a heritage in no way means to be limited by it." (Lenin)-సంచితాన్ని సంరక్షించుకోవటం అంటే దానికే పరిమితిఅయిపోవడంకాదు. సమాజభవిష్యత్తు శ్రమజీవుల పోరాటాలమీద ఆధారపడిఉన్నట్లే, నాటక భవిష్యత్తు కూడా ఆ ప్రజలమీదే ఆధారపడిఉంది. జీవితమే ఒక నాటకం-కాదు-నాటకమే ఒక జీవితంకావాలి.

## సవరణ

'జాతులసమస్య' గురించి కె. వి. రమణారెడ్డిగారు రాసినవ్యాసంలో (సృజన నెం. 131, సెప్టెంబర్' 82) యీకింది అచ్చుపొరపాట్లు వచ్చాయి.

| పేజీ | పేరా | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 36 | 3 | 3 | 'అన్యప్రాంతంలో' | అనన్యమైనప్రాంతం లేదా నిశ్చితమైనప్రాంతం |
| 37 | - | 1 | arparised | organised |
| 38 | - | 7 | యూరపియన్ దేశాలతో | యూరపియన్ దేశాలలో |
| 39 | 1 | 6 | వెండెల్ విల్క్ | వెండెల్ విల్కీ |
| 41 | - | 2 | సమతూకం వుంటుందాద | సమతూకం వుంటుందా ? |
| 41 | - | 3 | పెట్టుబడీదా ? | పెట్టుబడిదారీ |
| 41 | - | 7 | అగర్‌బైజాన్ | అజర్‌బైజాన్ |
| 41 | 1 | 2 | concystnol | conceptual |
| 43 | 1 | 15 | Intenal | Internal |
| 44 | 2 | 6 | పిరమిడీ | పిరమిడ్ |
| 45 | 1 | 11 | సముద్రానికి ఉత్తరాన | బాంగ్లాదేశ్‌కు ఉత్తరాన |
| 46 | 1 | 7 | టెర్రరిస్టు వాదులను | టెర్రరిస్టు దాడులను |
| 47 | 1 | 2 | దశాబ్దాల | శతాబ్దాల |

గమనించవలసిందిగా పాఠకులకు మనవి.

సం॥

---

తెలుగు సినిమాలో 'అభ్యుదయ'వాదులు - చేర్పులు

అభ్యుదయ రచయితలసంఘం

అబ్బూరి వరదేశ్వరరావు రచయిత

ప్రజానాట్యమండలి

కాకరాల నటుడు

# బొంబాయి బట్టలమిల్లు కార్మికుల సమ్మె

కె. బాలగోపాల్

[జనవరి 18, 1982న మొదలయిన బొంబాయి నగరపు బట్టల మిల్లులలో సుదీర్ఘమయిన సమ్మె జరుగుతోంది, ఆ సమ్మెను గురించి వివిధ పత్రికలు రాసాయి, రాస్తున్నాయి. ఈ మధ్యనే బొంబాయి నగరంలోని కొందరు పత్రికారచయితలు, మేధావులు కలిసి Bombay's Historic Textile Stnike అనే పుస్తకాన్ని ప్రచురించారు. ఆ పుస్తకం మీద, ఇతరత్రా లభించిన సమాచారం మీద, ఆధారపడి రాసిన వ్యాసం ఇది]

## I

అది 1908 సంవత్సరం. జూన్ - జూలై నెలలు. దేశంలో మూడేళ్ళగా స్వదేశీ ఉద్యమం నడుస్తోంది. కాంగ్రెస్ పిలుపిచ్చిన విదేశీవస్తు బహిష్కరణ మాత్రమే కాకుండ, బూర్జువా చరిత్రకారుల కళ్ళకు కనబడని ప్రజాఉద్యమాలు ఎన్నో ఆ మూడేళ్ళలో నడిచాయి. అహమ్మదాబాద్‌లో బట్టలమిల్లుల కార్మికులు, బొంబాయిలో పోస్టల్ సిబ్బంది, తూర్పున అసాన్సోల్‌లో మొదలయి అలహాబాద్ దాకా రైల్వే కార్మికులు, ఆ కాలంలో మహత్తరమయిన సమ్మెపోరాటాలు చేసారు. ఒక సంవత్సరం పూర్వం, 1907లో, కాంగ్రెస్‌పార్టీ సూరత్ సమావేశంలో, అధికార చరిత్రకారుల పరిభాషలో మితవాదులు బ్రిటిష్ ప్రభుత్వంతో సహకరించాలనీ, విదేశీవస్తు బహిష్కరణ విరమించాలనీ, హింసామార్గం కూడదనీ, వాదించారు. అతివాదులు బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా మిలిటెంట్ ఉద్యమం నడపాలని కాంక్షించారు. సామాజిక దృక్పథంలో ఇద్దరికీ పెద్దగా తేడాలేదు. ఒకరికి రక్తంలో వేడితక్కువ, ఇంకొకరికి వేడికొంచెం ఎక్కువ, అంతమాత్రమే.

ఈ వేడిరక్తపు జాతీయనాయకులలో బాలగంగాధర్ తిలక్ ముఖ్యుడు. ఒక్క మిలిటెన్సీ మినహాయిస్తే తిలక్‌ది చాలా తిరోగామి దృక్పథం. జాతీయతత్వాన్ని మేల్కొలపడానికి తిలక్ హిందూ సాంస్కృతిక చిహ్నాలను విరివిగా వాడుకున్నాడు. గోరక్షణ సంఘం ఒకటి ఏర్పాటుచేసాడు. గణపతి ఉత్సవాన్ని ఒక సాంస్కృతిక రాజకీయ వేడుకగా ప్రవేశపెట్టాడు. తన రాజ్యాన్ని కాపాడుకోవడానికి ముగల్ బాద్‌షాతో యుద్ధం చేసి శివాజీని జాతీయ నాయకుడిగా నిలబెట్టి శివాజీ జన్మదినాన్ని పెద్ద జాతరగా జరిపేఅలవాటు ప్రవేశపెట్టాడు. ఆ తంతుముదిరి తరువాతికాలంలో

గణపతి ఉత్సవం హిందూ మతోన్మాదానికీ, శివసేన పుట్టిన తరువాత శివాజీ జన్మ దినోత్సవం మరాఠా కులతత్వానికీ వేదికలయ్యాయి.

ఏదయితేనేం, కాంగ్రెస్‌లో తొలిసారిగా మిలిటెంట్ పోరాటాలు నిర్వహించా లనీ, వాటికోసం ఏదో ఒక రూపంలో ప్రజలలోకి పోవాలనీ ప్రతిపాదించి ఆ ప్రతి పాదనను అమలుచేసినవాడు తిలక్. తానున్నది బొంబాయినగరం కాబట్టి ప్రజలలోకి పోవడం అంటే బొంబాయి నగరంలోని పెటీబూర్జువా వర్గంలోకీ, అప్పటికే రెండు లక్షలసంఖ్య అందుకున్న పారిశ్రామిక కార్మికులలోకీ, పోవడం. ఆ రెండు లక్ష లలో ఒక లక్షమంది బట్టల మిల్లులలో పనిచేస్తున్నారు. తిలక్ అనుచరులు ఈ బట్టలమిల్లుల కార్మికులలో జాతీయభావాలు ప్రచారంచేస్తూ, వాళ్ళసమస్యలమీద కది లించడం గూడ మొదలుపెట్టారు. తిలక్ దృక్పథంలోని తిరోగామి తత్వానికి సుకో మల్ సేన్ ఈ ప్రచారం నుండి కొన్ని ఉదాహరణలు ఇస్తాడు. సమ్మెకు పిలుపిస్తూ తిలక్ అనుచరులు వేసిన పోస్టర్లలో ఒకటి : 'పనిలోకి పోయినవాడు విదేశీయుడికో లేక పాకీవాడికో పుట్టినట్టులెక్క'. ఇంకొకటి ; 'పనిలోకి పోతే గోవును చంపి నంత పాపం'.

ప్రజలలోకి ఏరూపంలో పోతేనేం, ప్రజలలోకి పోతున్నారంటేనే చాలు, పాలకవర్గాలకు దడపుట్టడానికి. 1907 సూరత్ సమావేశం జరిగి ఒక సంవత్సరం తిరిగి తిరగకముందే 1908 జూన్ 24న తిలక్‌ను అరెస్టుచేసారు. ప్రభుత్వాన్ని కూలదోస్తున్నాడనే నేరం (Sedition) కింద కేసుబనాయించి జూలై 13న విచారణ ప్రారంభించి జూలై 22న ముగించి బొంబాయి హైకోర్టు తిలక్‌ను 6 సంవత్సరాలు కారాగారశిక్ష వేసింది. ఆ నెలరోజులలో బొంబాయి కార్మికవర్గం తన మొట్టమొదటి రాజకీయ సమ్మె జరిపింది. అందులో సంఖ్యరీత్యా సగములున బట్టలమిల్లుల కార్మి కులు ప్రముఖంగా పాల్గొన్నారు.

తిలక్ వాళ్ళ యూనియన్ నాయకుడు కాదు. అసలు ఆనాటికి వాళ్ళకు యూని యన్‌లు లేవు. కాని తమలో జాతీయ చైతన్యం మేల్కొలపిన జాతీయనాయకుడిగా వాళ్లు తిలక్‌ను గుర్తించారు. తిలక్‌పై విచారణ మొదలయినదినాన, అంటే జూలై 13న, గ్రీవ్స్‌కాటన్ అండ్ కంపెనీ మిల్లు కార్మికులు తమపనిముట్లను పక్కకుపెట్టి హైకోర్టుకు నడిచారు. అంతకుముందే (అంటే తిలక్ అరెస్టయిన నాటినుండీ) కార్మికుల అసంతృప్తికి గురయిన బ్రిటిష్ ప్రభుత్వం, రహదారులను సాయుధ

సైనికులతో కాపలా కాయించింది. వాళ్ళతో ఘర్షణజరిగి కార్మికులు, కార్మికులతో కలిసిన సామాన్యప్రజానీకం, దెబ్బలుతిన్నారు. తరువాతి రోజునుండి బ్రిటిష్ పాలకులు మిల్లు ప్రాంతాలను సైనికులతో చుట్టుముట్టి కార్మికులెవ్వరూ నగరంలోకి రానివ్వకుండ చేయాలని చూసారు. జూలై 14, 15, 16 ఇట్లా గడిచాయి. 17న ఒక్క గ్రీవ్స్‌కాటన్ అండ్ కంపెనీయే కాక, ఇంకా మరొక తొమ్మిది కంపెనీల నుండి మొత్తం 20 వేలమంది కార్మికులు పారిశ్రామిక ప్రాంతమంతా తిరిగి ఇతర కార్మికులను బయటకు రమ్మన్నారు. 18న కూడ అదే జరిగింది. ఫలితంగా జూలై 19న 60 మిల్లుల నుండి 65 వేలమంది కార్మికులు సమ్మెచేసారు. జీవితంకోసం కాదు, భత్యంకోసంకాదు, తిలక్‌పై దొంగ విచారణ ఆపాలని. జూలై 22న తిలక్‌కు వేసిన శిక్షకు నిరసనగా 23న పూర్తిసమ్మె జరిపారు. ఒక లక్షమంది కార్మికులు ఆనాడు సమ్మెలో పాల్గొన్నారు. వారికితోడుగా లక్షలాది మంది సామాన్య ప్రజానీకం హర్తాల్ చేసారు. తరువాతి రోజునుండి పోలీసులతో వీధులలో తలపడి తుపాకీలకు రాళ్లూ ఇటుకలూ ఎదురొడ్డి పోరాడారు. ఎంతమంది చనిపోయారో లెక్క తెలీదు. ఈ పోరాటాన్ని గురించి దేశంలోని జాతీయనాయకులని పిలవబడే వాళ్లు ఏమను కున్నారోగాని, రష్యా నుండి దీన్ని గమనించిన లెనిన్, 'భారతదేశంలో కూడ కార్మికవర్గం చైతన్యవంతమయిన రాజకీయ ప్రజాపోరాట స్థాయిని అందుకుంటోంది. ఇక ఇండియాలోని బ్రిటిష్ రాజ్యానికి కాలంచెల్లినట్టే' అన్నాడు.

## *II*

బ్రిటిష్ రాజ్యానికయితే కాలంచెల్లిందికానీ, సామ్రాజ్యవాదానికి ఇంకా ఈ దేశంలో ఆయుస్సుమిగిలేవుంది. బొంబాయి బట్టల మిల్లుల కార్మికులు తమ మొట్ట మొదటి రాజకీయ సమ్మెచేసి ఇవ్వాల్టికి 74సంవత్సరాలు గడిచాయి. సామ్రాజ్య వాదం పట్టులో దేశమంతటిలాగే బొంబాయి బట్టల పరిశ్రమకూడ నత్తనడకనడుస్తోంది 1908 లోనే ఒక లక్షమంది కార్మికులున్న పరిశ్రమలో ఇవ్వాళ 2 నుండి 2½ లక్షల వరకు మాత్రమేవున్నారు (దాదాపు 1 లక్షమంది ఏరోజుకారోజు పనిదొరుక్కునే బదిలీ - తాత్కాలిక - కార్మికులు కావడాన నికరమయిన సంఖ్య ఇవ్వడం కష్టం). ఈ సంఖ్యకూడ రెండవ ప్రపంచయుద్ధం చివర చేరుకున్నది. ఆ తరువాత దేశంలో బట్టల పరిశ్రమ అంతగా అభివృద్ధిచెందలేదు. చెందినంతమేరకు చేనేత (handlcom) రంగంలోనూ, చిన్నచిన్న కార్ఖానాల (Powerloom) రంగంలోనూ చెందింది. పెద్ద పెద్ద మిల్లులలో మెరుగుదల కొంత జరిగిందిగానీ, ముఖ్యంగా ఈ మధ్యకాలంలో

యంత్రీకరణ (mechanization) బలం పుంజుకోవడం వలన కార్మికుల సంఖ్య అంతగా పెరగలేదు. ఇకముందు క్రమంగా తగ్గిపోయే అవకాశం గూడ వుంది. ఆధునిక యంత్రాలను ప్రవేశపెట్టడం, కార్మికులలో కొంత మందిని పనినుండి తొలగించి, మిగిలినవారికి జీతాలు కొద్దిగా పెంచేఏర్పాటు యూనియన్లతో చేసుకోవడం రివాజయిపోయింది. ఈ తొలగింపు (retrenchment) కు వ్యతిరేకంగాను, ఇతరకోర్కెల సాధనకోసమూ బొంబాయి బట్టల మిల్లుల కార్మికులు పోరాటాలు చేయకుండ ఉండలేదు. 1928లో ఒకసారి 6 నెలలపాటు తొలగింపుకు వ్యతిరేకంగా సమ్మె చేసారు. 1929 తరువాత అంతర్జాతీయంగా వచ్చిన పెట్టుబడిదారీ సంక్షోభంలో బొంబాయి బట్టలమిల్లు కార్మికులు 10 వేలమంది ఉద్యోగాలు కోల్పోయారు. 1934లో ఒకసారి, 1938 లో ఒకసారి, తీవ్రమయిన సమ్మెలు చేసారు. 1940 లో డి. ఏ. కోసం 40 రోజులు సమ్మెచేసి సాధించుకున్నారు. 1950 లో బోనస్‌కోసం 67 రోజులు సమ్మెచేసి పోలీసు కాల్పులలో 12 మంది ప్రాణాలుకోల్పోయారు. 1974లో డాంగే నాయకత్వాన 42 రోజులు సమ్మెచేసారు. మళ్ళీ ఇవ్వాళ దత్తాసామంత్ నాయకత్వాన ఒక సంవత్సరకాలంగా అపూర్వమయిన పోరాటం చేస్తున్నారు. నిజానికి రైల్వే, జనపనారమిల్లు కార్మికులతోపాటు బట్టలమిల్లుల కార్మికులు జాతీయోద్యమ కాలంలో మిలిటెంట్ పోరాటాలను నడపడంలో అగ్రస్థానంలో ఉండేవారు.

పోరాటాలు నడపడమే కాదు, భారత కమ్యూనిస్టు ఉద్యమానికి గ్రామాలలో నెలవుదొరికేదాకా బొంబాయి బట్టలమిల్లుల కార్మికులే ప్రముఖ స్థావరంగా వున్నారు, ఇవ్వాళ దత్తాసామంత్ భవిష్యత్తును నిర్ణయించే పోరాటాన్ని నడుపుతున్న కార్మికులే శ్రీపాద అమృత డాంగే గారికి ఒక భవిష్యత్తంటూ కల్పించారు - 1928 లో. 1928 ఏప్రిల్ 26న మొదలయి కార్మికుల తొలగింపుకు వ్యతిరేకంగా 6 నెలల పాటు నడిచిన ఒక మహత్తరమయిన సమ్మె క్రమంలోనే కమ్యూనిస్టుల మొట్ట మొదటిసంఘమయిన గిర్ని కాంగార్ యూనియన్ పుట్టింది. 1928 మే నెలలో 300 మంది సభ్యులతో పుట్టిన ఈయూనియన్ సంవత్సరంచివరికి 50వేల మంది సభ్యులను సంపాదించుకుంది. డాంగే దాని మొట్టమొదటి కార్యదర్శి. డాంగే, మీరజ్‌కర్, రణదివె, ఎస్.వి. దేశ్‌పాండే ఎస్.జి. సర్దేశాయి, వీళ్ళంతా గిర్ని కాంగార్ యూనియన్ నుండి బలం సంపాదించుకున్న కమ్యూనిస్టు నాయకులే. మీరట్ కుట్రకేసు నిందితులలో ఏడుగురు గిర్ని కాంగార్ సంఘం బాధ్యులు. ఆనాటి డాంగే ఇవ్వాళ్ళ, ఒక సంవత్సరంగా సాగుతోన్న సమ్మె సందర్భంలో, మాట్లాడే అర్హత గూడ కోల్పోయా

దంటే తన సుదీర్ఘమయిన రాజకీయ పతనానికి దత్తా సామంత్ పౌరోహిత్యాన అంత్యక్రియలు జరిగినట్లు ప్రకటించుకోవడమే.

అయితే కమ్యూనిస్టుల ప్రభావాన్ని అంతంచేసే ప్రయత్నం దత్తాసామంత్ తో మొదలుకాలేదు. గిర్నీకాంగార్ యూనియన్ ఏర్పడి, AITUC లో ఒక ప్రభావ వంతమయిన సంస్థగా రూపొందిన నాటినుండీ బట్టలమిల్లుల కార్మికులను కమ్యూనిస్టుల నుండి రక్షించాలనే ప్రయత్నం చాలా తీవ్రంగాసాగింది. కాంగ్రెస్‌వారూ, 'సోషలిస్టులూ', రాయిస్టులూ కలిసి 1929 లో ఒకసారి, 1931 లో రెండవసారి, AITUC ని చీల్చినప్పుడు రెండుతడవలూ గిర్నీకాంగార్ యూనియన్ వివాదాంశాలలో ఒకటిగా వుండింది. AITUC చీలికతోబాటు గిర్నీకాంగార్ యూనియన్‌గూడ చీలి ఒకభాగం గిర్నీకాంగార్ యూనియన్ (లాల్‌బావుటా) అనే పేరుతో కమ్యూనిస్టులకు మిగిలింది.

కాని కాంగ్రెస్ వారు తమ కార్మికవ్యతిరేక చర్యలను AITUC ని చీల్చడానికి పరిమితం చేయలేదు. బ్రిటిష్ వలసరాజ్యం పరిధిలోనే తమకు పరిపాలనాధికారం చేజిక్కిన నాటినుండీ చట్టాలరూపంలో కార్మికులను అణచడానికి ప్రయత్నలోపం లేకుండ కృషిచేస్తూనే వచ్చారు. 1935 భారతప్రభుత్వ చట్టంక్రింద రాష్ట్రాలలో ఎన్నికలు జరిగి 'స్వదేశీ' ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. అవి అధికారంలోవున్న 2½ సంవత్సరాలలో అవలంబించిన కార్మిక వ్యతిరేకపంథా స్వాతంత్ర్యానంతరం కాంగ్రెస్‌పాలన తీసుకోబోయేరూపాన్ని రుచిచూపించిందని సుకోమల్ సేన్ అంటాడు. బొంబాయిలో కాంగ్రెస్ ప్రభుత్వం చేసిన మొట్ట మొదటిపని బొంబాయి పారిశ్రామిక వివాదాల చట్టాన్ని (Bombay Industrial Disputes Act, 1938) జారీచేయడం. 1946 లో మళ్ళీ రెండవసారి రాష్ట్రాలలో అధికారానికి వచ్చిన కాంగ్రెస్‌పార్టీ 1938 చట్టాన్ని పునరుద్ధరిస్తూ బొంబాయి పారిశ్రామిక సంబంధాల చట్టాన్ని (Bombay Industrial Relations Act, 1946) జారీచేసింది. ఇవాల్టి సమ్మె అప్రకటిత లక్ష్యాలలో ఒకటి ఈ చట్టాన్ని ఎత్తివేయించడం కాబట్టి దీన్నిగురించి తెలుసుకోవాలి.

ఒక ఫ్యాక్టరీలోగాని, పారిశ్రామిక రంగంలోగానీ కార్మికులకూ, యాజమాన్యానికీ తగాదా వచ్చినప్పుడు పరిష్కారానికి స్థూలంగా రెండు మార్గాలుంటాయి. ఒకటి కార్మికులూ యాజమాన్యమూ విషయాన్ని ముఖాముఖ్గ తేల్చుకోవడం. కార్మికులు సమ్మెల ద్వారానూ, ఇతర పోరాట రూపాల ద్వారానూ యాజమాన్యం మీద ఒత్తిడి

తెచ్చి, చర్చలకు దించి తమకోర్కెలను ఏదో ఒక మేరకు సాధించుకుంటారు. రెండవమార్గం, పరిష్కారాన్ని చట్టం నియమించే పరిష్కార యంత్రాంగానికి వదిలి పెట్టడం. ఆ యంత్రాంగం లేబర్ ట్రిబ్యూనల్ వంటిదయితే ఈ మార్గాన్ని adjudication అనీ, లేక ప్రభుత్వం తాత్కాలికంగా వేసే నిపుణుల/ పెద్ద మనుషుల కమిటీ అయితే arbitration అనీ అంటారు. మొదటి పద్ధతే కొంత మేరకయినా కార్మికుల అవసరాలను సాధించగలదని వేరే చెప్పనవసరం లేదు. ఎందుకంటే, ఒక పరిష్కారయంత్రాంగం వుంటే, దానితో పాటు సమ్మెనిషేధాలు ఉంటాయి. ఆ యంత్రాంగానికి వివాదాన్ని అప్పజెప్పిన తరువాత అది తన తీర్పు ఇచ్చేదాకా సమ్మె చేయకూడదన్న నియమం ఉంటుంది. తీర్పు ఇచ్చిన తరువాత అంగీకరించక తప్పదు కాబట్టి అసలు సమ్మెలనే నిషేధించడం దీని తాత్పర్యం. ప్రభుత్వాలు పారిశ్రామిక వివాదాల చట్టాలనీ, పారిశ్రామిక సంబంధాల చట్టాలనీ ఎప్పుడు ప్రవేశపెట్టినా వాటి ఉద్దేశ్యం ఇదే. వివాదాల పరిష్కారానికి ఒక నిర్బంధ పరిష్కార యంత్రాంగాన్ని నెలకొల్పడం, అన్ని వివాదాలనూ ఆ యంత్రాంగానికి రిఫర్ చేయాలనీ, దాని తీర్పును శిరసావహించాలనీ శాసనంచేయడం, తద్వారా సమ్మెలను నిషేధించడం- ఇదీ వాటి సారాంశం.

1946 బొంబాయి పారిశ్రామిక సంబంధాల చట్టంలో (BIR Act, 1946) ఇవన్నీకాక మరొక అంశం గూడ ఉంది. అదేమిటంటే, వివాదాలలో కార్మికులకు ప్రాతినిధ్యం వహించే హక్కు గూడ అన్ని యూనియన్‌లకూ ఉండదు. ఒక్క 'గుర్తింపు పొందిన' (recognised) యూనియన్‌కు మాత్రమే ఉంటుంది. ఈ 'గుర్తింపు పొందడం' అన్నది నిజానికి గొప్ప బోగస్ నాటకం. వామపక్ష యూనియన్లు ముందు నుండీ గూడ, ఏ యూనియన్‌ను గుర్తించాలన్నది ఫ్యాక్టరీ కార్మికుల మెజారిటీ అభిప్రాయం మీద ఆధారపడి ఉండాలనీ, ఆ అభిప్రాయాన్ని రహస్య వోటింగ్ ద్వారా తెలుసుకోవాలనీ డిమాండ్ చేస్తూవస్తున్నాయి. కాని కాంగ్రెస్ ప్రభుత్వం మాత్రం యూనియన్ల సభ్యత్వపు చందారశీదులనుబట్టి ఏ యూనియన్‌కు ఎంత మద్దతుఉన్నదీ నిర్ణయిస్తుంది. ఈ 'గుర్తింపుపొందడం' అన్నది అన్ని చోట్లా వుంటుందిగాని, ఒకేఒక యూనియన్‌కు గుర్తింపుఇవ్వడం BIR చట్టం ప్రత్యేకత.

ఇంత పకడ్బందీగా కాంగ్రెస్ ప్రభుత్వం BIR చట్టాన్ని చేసిన తరువాత, తనకు అనుకూలమయిన యూనియన్ ఒక దానిని ఏర్పాటుచేసింది. నిజానికి ఇలాంటి

ఏర్పాట్లు బొంబాయి బట్టల మిల్లులకు మాత్రమే పరిమితంకాలేదు. 1940 ల దాకా ఇతరులతో కలిసి కార్మికరంగంలో పనిచేసిన కాంగ్రెస్‌పార్టీకి అధికారమార్పిడీదగ్గర పడేకొద్దీ తన స్వంత యూనియన్ల అవసరం తెలిసివచ్చింది. జాతీయోద్యమకాలంలో బూర్జువా వర్గానికీ కార్మికవర్గానికీ ఉండే సంబంధంవేరు, బూర్జువా వర్గానికి ఏమేర కయినా అధికారం చేజిక్కిన తరువాత ఉండే సంబంధంవేరు. జాతీయోద్యమ కాలంలో ఆ సంబంధంలో కొంత స్వాతంత్ర్యం ఉంటుంది. అటుపిమ్మట మాత్రం కార్మికులచేత నయానా భయానా పనిచేయించడం వరకే ఆ సంబంధం పరిమితం. భయాన పనిచేయించడానికి పోలీసులూ, Industrial Security Force, వగైరాలు అవసరమయితే నయాన పనిచేయించడానికి తొత్తు యూనియన్లు కావాలి. అందుకే 1947 దగ్గరపడేకొద్దీ దేశవ్యాప్తంగా అన్ని పారిశ్రామిక రంగాలలోనూ కాంగ్రెస్ కార్మికసంఘాలు తయారయ్యాయి. వీటన్నిటి కలయికగా 1946లో INTUC ఏర్పాటయింది.

ఆరకంగా బొంబాయి బట్టలమిల్లుల్లో ఏర్పడింది రాష్ట్రీయ మిల్ మజ్దూర్ సంఘం (RMMS). ఇది 1945లో ఏర్పడింది. అప్పటినుండి ఇప్పటిదాకా బొంబాయి బట్టలమిల్లులలో 'గుర్తింపుపొందిన' ఏకైక యూనియన్‌గావుంది. 'గుర్తింపు' తరచుగా పునఃపరిశీలించబడదు కాబట్టి ఒకసారి గుర్తింపుపొందితే తొలగించడం కష్టం. సి.పి.ఐ., లాల్‌నిషాన్‌పార్టీ, మరొక మూడుపార్టీల యూనియన్లు కలిసి ఒకసారి కోర్టుకుపోయిగూడ ఆర్. ఎమ్. ఎమ్, ఎస్. ను గద్దెదించలేకపోయాయి.

యాజమాన్యానికి తొత్తుగా పనిచేయడం INTUC యూనియన్లకు కొత్త కాదుగాని, RMMS ఇందులో సాటిలేనిదనిపించుకుంది. ఫలితంగా, 1960 దాకా బొంబాయిలోని అన్ని పారిశ్రామికరంగాలలోకీ బట్టలమిల్లులలోనే వేతనాలు అధికంగా వుండేవికాగా, ఇప్పుడు ఇంజనీరింగ్, కెమికల్, వగయిరా రంగాలకార్మికులు బట్టల మిల్లుల కార్మికులకంటె 75 శాతంనుండి 100 శాతంవరకు ఎక్కువ సంపాదిస్తున్నారు. దీనికి ప్రధానమయిన కారణాలు రెండు. ఒకటి, జీతంలో సాలుసరిఇంక్రిమెంట్లు (annual increments) ఉండవు. కాబట్టి ఎప్పుడయినా జీతంపెరిగితే అది పోరాటాల ఫలితంగానేతప్ప ఇతర కార్మికులకూ సిబ్బందికీ వచ్చినట్టు సీనియారిటీ పెరిగే కొద్దీ జీతంలోపెరుగుదలరాదు. అట్లాంటప్పుడు పోరాటాలుచేసే యూనియన్ లేకపోతే జీతంపెరుగుదల మందగించడం సహజం. రెండవది డి.ఏ. చాలాతక్కువగా

ఉండడం. ఇవ్వాళ దేశంలోని కార్మికసంఘాలన్నీ 100 శాతం neutralisation కోసం ప్రయత్నిస్తున్నాయి. అంటే ధరలు రెండురెట్లయితే వేతనాలుగూడ రెండు రెట్లుకావడమన్నమాట. ఇప్పటికే చాలారంగాలలో 60-70 శాతం neutralisation సాధించారు. బొంబాయి బట్టలమిల్లు కార్మికులకుమాత్రం 40 శాతమే దక్కుతుంది. అదిగూడ శాశ్వతఉద్యోగాలున్న కార్మికులకే, తాత్కాలిక (బదిలీ)కార్మికులకుకాదు. మొత్తం కార్మికులసంఖ్యలో ఈబదిలీకార్మికులు 25 శాతం ఉన్నారని అధికారుల అంచనా. 41 శాతమని అనధికారఅంచనా. అందులో సగంమంది పదకు రెండేళ్ళ పైగా పనిచేస్తున్నా పర్మనెంటుకాలేదు. వీళ్ళకు పనిదొరికిన రోజునకూలి 27 రూపాయలుంటుంది గాని, నెలలో 15 రోజులుమించి పనిదొరకదు. కాబట్టి నెలసరి ఆదాయం 400 రూపాయలు దాటదు. వేరే ఏ భత్యాలూ ఉండవు. ఈ మాత్రంకోసం రోజూ మిల్లుగేట్లదగ్గర పడిగాపులుగాసి తమ 'అదృష్టం' పరీక్షించుకోవాలి.

ఫ్యాక్టరీలలో వాతావరణం చాలాఅనారోగ్యకరంగా వుంటుంది. పత్తిధూళి వల్ల క్షయ, బ్రాంకైటిస్, వగైరారోగాలు వస్తాయి. ప్రతీనలుగురు కార్మికులలో ఒకడు ఈ రకమయిన వ్యాధులతో బాధపడుతున్నారని ఇ. ఎస్. ఐ అంచనా. మగ్గాలు నిరంతరాయంగా చేసేచప్పుడువలన చాలాకాలంపనిచేసే కార్మికులకు చెవుడురావడం కద్దు.

యంత్రీకరణ మరొక ముఖ్యమయిన సమస్య. ముఖ్యంగా గత పదిసంవత్సరాలుగా, యంత్రీకరణవల్ల కార్మికులు ఉద్యోగాలు కోల్పోవడం, కోల్పోనివాళ్ళ శ్రమభారం work-load), ఉత్పాదకత (Productivity), చాలాపెరిగినా వేతనాలు అందుకు సమంగా పెరగకపోవడం, ప్రధానమయిన సమస్యలుగా తయారయ్యాయి. సమీపభవిష్యత్తులో ఈసమస్య చాలా తీవ్రతరం కాబోతుందనీ, ఇవ్వాళ్టిసమ్మె విజయవంత మయితేనే దాన్ని ఎదుర్కొనేశక్తి కార్మికులకుంటుందనీ, పరిశీలకుల భావన.

వీటన్నిటికన్నా అభ్యంతరకరమయినవి RMMS పెంచాగిరీ, దానిఆధిపత్యాన్ని సంరక్షించే BIR చట్టం.

## III

ఇది చరిత్ర, పూర్వరంగం. 1981 అక్టోబరులో ప్రతీసంవత్సరం లాగే బోనస్‌గురించి వివాదంవచ్చింది. ప్రభుత్వం నిర్ణయించిన కనీసబోనస్ వేతనంలో 8.33 శాతం. కాని మామూలుగా యూనియన్-యాజమాన్యాల బలాబలాల్నిబట్టి 20

శాతంవరకు సంపాదించుకుంటారు కార్మికులు. ఏదైతే 'గుర్తింపు' పొందిన యూనియన్ RMMS కావడానా, అది యాజమాన్యపుతొత్తు కావడానా, ప్రతిసంవత్సరమూ సిపిఐ తదితర వామపక్షపార్టీల యూనియన్లు ఒత్తిడితెచ్చి RMMS చేత కొంచెం హెచ్చుబోనస్‌కే బేరంపెట్టించడం రివాజయింది బొంబాయి బట్టలమిల్లులలో. ఈ సంవత్సరమూ అట్లాగేఅయి, 8.33 నుండి 17.33 శాతంవరకు ఒక్కొక్కమిల్లు ఒక్కొక్కరేటుకు ఒప్పుకుంది.

కార్మికులు సంతృప్తిచెందలేదు. ఎవ్వరిప్రోద్బలం లేకుండ 15 మిల్లుల కార్మికులు ఒకరోజు బైఠాయింపు సమ్మెచేసారు. తరువాతరోజుగూడ 8 మిల్లుల నుండి 25 వేలమంది కార్మికులు సమ్మెకొనసాగించాలని చూసారు. ఆ తరువాత రోజు స్టాండర్డ్ మిల్లుకార్మికులు ఒక వింతపనిచేసారు. 'గుర్తింపు'పొందిన RMMS నే కాక, సిపిఐవారి బొంబాయిగిర్నికాంగార్ యూనియన్‌నూ, సిపిఐ(ఎం)వారి లాల్‌బావుటా గిర్నికాంగార్ యూనియన్‌నూ, జార్జిఫెర్నాండెస్‌గారి గిర్ని కాంగార్ సభనూ, లాల్‌నిషాన్‌పార్టీకి చెందిన కపడ్‌కాంగార్ సంఘటననూ, అన్నింటినీ కాదని, బొంబాయి కార్మికరంగపు సినీహీరోఅయిన దత్తాసామంత్ ఇంటికివెళ్ళారు. 37 సంవత్సరాలుగా తొత్తుయూనియన్ అయిన RMMS ను 'గుర్తింపు స్థానంనుండి తొలగించలేకపోవడం ప్రతిపక్షయూనియన్ల ప్రయత్నలోపంవల్ల కాకపోవచ్చు. ఈ కర్మభూమిలో INTUC కి తప్ప వేరేకార్మికసంఘానికి ప్రాతినిధ్యస్థానం లభించే అవకాశం లేకపోవచ్చు. అయినా కార్మికులు ప్రతిపక్షయూనియన్లను ('కమ్యూనిస్టు' యూనియన్లతోసహా) క్షమించదల్చుకోలేదు. తిన్నగా దత్తాసామంత్ ఇంటికివెళ్ళి, అంతవరకు అత్యధికంగా ఇంజనీరింగ్ కంపెనీలకు పరిమితమయివుండిన అతనిని తమకు నాయకత్వం వహించమని ఆహ్వానించారు.

దీనికొక కారణంవుంది. కార్మికులు రణదివేనీ, డాంగేనీకాదని దత్తాసామంత్ సమ్మోహనశక్తికి లోనయ్యారంటే అదివాళ్ళలో కార్మిక వర్గచైతన్యం లోపించడం వల్లకాదు. వేరేఒక బలమయిన కారణంవుంది. మొదట్లోఅన్నట్లు, పారిశ్రామిక రంగంలో వివాదాల పరిష్కారానికి రెండుమార్గాలుంటాయి. ఒకటి పోరాటాలద్వారా, రెండు ప్రభుత్వంనెలకొల్పే నిర్బంధ పరిష్కార యంత్రాంగంద్వారా. బూర్జువా రాజ్యాంగం ఇచ్చేఅవకాశాలన్నింటినీ విప్లవంకోసం వాడుకోవాలనే తెలివిమాలిన ఎత్తుగడ చేపట్టినప్పటినుండీ రివిజనిస్టులు అన్ని బూర్జువాయూనియన్లలాగే ద్వైపాక్షిక సంప్రదింపుల సంరంభంలోనూ లేబర్‌కోర్టుల ఫైళ్ళలోనూ చిక్కుపడిపోయారు.

దత్తాసామంత్ దానికివిరుద్ధంగా ఆ యంత్రాంగాన్ని తిరస్కరించి దీర్ఘమయిన సమ్మెలద్వారా ఒత్తిడితెచ్చి యాజమాన్యంతో చర్చలుజరిపి సాధించుకోవడం అలవర్చుకున్నాడు. దీనివల్ల నష్టాలు జరగలేదనికాదు. జరిగాయి. ఈ పద్ధతి అన్ని పరిస్థితులలోనూ ఆచరణ సాధ్యమనిగూడకాదు. కాని తమపోరాటచైతన్యాన్ని ప్రాతిపదికగా చేసుకునే సామంత్‌ను కార్మికులు గౌరవించడం సహజం.

సామంత్ బట్టల పరిశ్రమరంగంలోకి దిగడానికి కొంత అయిష్టంగానే ఒప్పుకున్నాడు. ఆరోజు స్టాండర్డ్ మిల్లుతో మొదలుపెట్టి రోజుకొకమిల్లుదగ్గర గేట్ మీటింగులు జరపాలని నిర్ణయించుకున్నారు. అయితే త్వరలోనే గేట్ మీటింగులకు మిల్లు ఆవరణ చాలలేదు. కేవలం ఒకమిల్లుదగ్గర గేట్ మీటింగ్‌కు 50 వేలమంది రావడం మొదలుపెట్టేసరికి రోజుకొక బహిరంగసభ అయింది. బోనస్‌తో ప్రారంభమయిన సమ్మె దీనితో తనపరిధిని విస్తరించుకుంది. వేతనాలలో గణనీయమయిన పెరుగుదల బదిలీకార్మికులకు శాశ్వతఉద్యోగం, ప్రముఖలక్ష్యాలయ్యాయి. RMMS ను తొలగించడం, BIR చట్టాన్ని ఎత్తివేయడం, అప్రకటిత లక్ష్యాలయ్యాయి. అప్రకటితమే అయినా, వాస్తవానికి RMMS పట్ల, BIR చట్టంపట్ల, 37 ఏళ్ళుగా కార్మికులలో పేరుకుపోయిన తీవ్రమయిన అసంతృప్తిబద్దలుకావడమే ఈసమ్మెకుమూలం.

నిజానికి కార్మికుల పోరాటచైతన్యానికి దత్తాసామంత్ సినీహీరో ఫిలిపెస్ట్ గూడ చాలలేదు. అప్పటి రాష్ట్రముఖ్యమంత్రి అయిన అంతులే, కార్మికుల సమస్యలను పరిశీలించడానికి ముగ్గురుసభ్యుల కమిటీనొకదానిని వేయబోతున్నాననీ, ఆ కమిటీ రెండునెలలలో తననివేదికను సమర్పిస్తుందనీ, ప్రకటించాడు. సమ్మెచేస్తున్న ఎనిమిదిమిల్లుల కార్మికులు సమ్మెవిరమించాలని కోరాడు. దత్తాసామంత్ సమ్మె విరమణకు అంగీకరించలేదుగాని, కమిటీ తననివేదికను సమర్పించేదాకా ఎదురుచూడడానికి ఒప్పుకున్నాడు. ఈ అంగీకారాన్ని లక్షన్నరమంది కార్మికులు హాజరైన బహిరంగసభలో ప్రకటించాడు. కార్మికులలో చాలాఅసంతృప్తి కలిగించిన ఈ ప్రకటనవల్ల బట్టలమిల్లుల రంగంలో సామంత్‌జీవితం మూన్నాళ్ళముచ్చటగా ముగిసేదేగాని, మిల్లుయజమానులూ, RMMS నాయకులూ, అతన్ని రక్షించారు. ఆ ఎనిమిది మిల్లులలో సమ్మెనుగూడ సామంత్ విరమించుకోలేదన్న సాకుచూపి వాళ్లు ప్రభుత్వం వేయబోయేకమిటీతో సహకరించ నిరాకరించారు. ప్రభుత్వంగూడ ఆ కమిటీని వేయడంలో జాప్యంచేసింది. వీళ్ళందరి ఆలోచనా ఒకటే. ఇప్పటికే దత్తాసామంత్ ఇంజనీరింగ్ పరిశ్రమలో బలంగాతయారయ్యాడు. బట్టలమిల్లులలో

గూడ అతనుగెలిస్తే ఇక ఆపేవారుండరు. ఆధునిక పారిశ్రామిక కార్మికులనుండి హమాలీలవరకు బొంబాయి నగరశ్రామికలోకం అంతటికీ సామంత్ చక్రవర్తి అవుతాడు.

వాళ్ళఅనుమానాలు సామంత్‌కు లాభదాయకమయ్యాయి. కమిటీవేసి కార్మికులకు ఏ 100 రూపాయలో వేతనం పెంచివుంటే సామంత్ బహుశా సమ్మెవిరమించుకునే వాడేమోగాని, అట్లా జరగకపోయేసరికి గత్యంతరంలేక అతను మళ్ళీ కార్మికులకు సమ్మెకు సిద్ధంకమ్మని పిలుపిచ్చాడు. జనవరి 6న ఒకరోజు మొత్తం మిల్లులన్నీ మూతపడ్డాయి. జనవరి 18 నుండి నిరవధికంగా అన్నిమిల్లులలోనూ సమ్మె మొదలయింది. ఈ సంవత్సరం జనవరి 18కి దానికి ఒకసంవత్సరం నిండుతుంది. ఈ సమ్మెనుగురించి అందరు పరిశీలకులూ చెపుతున్నమాటలు రెండున్నాయి. ఒకటి, కార్మికులు బోనస్‌కంటే, జీతానికంటే, RMMS ను 'గుర్తింపు' స్థానం నుండి తొలగించడానికీ, BIR చట్టాన్ని ఎత్తివేయించడానికీ, ఎక్కువప్రాధాన్యత నివ్వడం. అంటే సమ్మెను ఆర్థికంగాకాకుండ రాజకీయంగా కార్మికులే పరిగణించడం. రెండవది కార్మికులలోని అపూర్వమయిన పోరాటఉత్సాహం, పట్టుదల. ఏ బహిరంగసభకూ ఇంతవరకు 50వేలనుండి 1 లక్షకు తక్కువమంది హాజరయినట్టు లేదు. కార్మికనాయకులు పోలీసులతో తలపడవద్దనీ దుస్సాహసాలు చేయవద్దనీ వారిస్తున్నా వినక పోలీసులతో ముఖాముఖి పోరాటానికి కార్మికులుదిగిన సంఘటనలుచాలా ఉన్నాయి. జూలై 4న వర్లీలో 1000 మంది కార్మికులు పోలీసులతో వీధిలోనే తలపడి మూడుగంటలసేపు ట్రాఫిక్‌ను నిలిపేసారు. సమ్మెజరుగుతున్న ఫ్యాక్టరీలలోకి RMMS ప్రోత్సాహంతో విచ్ఛిన్నకారులు (black-legs) పనిలోకివెళితే వాళ్ళను సురక్షితంగా ఇంటికిచేర్చేబాధ్యత మీదవేసుకోవడానికి పోలీసులుసహితం భయపడుతున్నారు. వాళ్ళను సమ్మెచేస్తున్న కార్మికుల కోపంనుండి కార్మికనాయకులే రక్షించాల్సి వస్తోంది. కార్మికుల పట్టుదలగూడ అపూర్వమయినది. కడుపుమాడేసరికి ఉత్సాహంచచ్చి పనిలోకి పోవడంలేదు, ఏదోఒక పనిచేసుకొని పొట్టపోసుకుంటున్నారు. హమాలీలుగా, టాక్సీడ్రైవర్లుగా, పోర్టర్లుగా, కూలీలుగా, పనిచేస్తున్నారు. కొందరు కూరగాయలు అమ్ముకుంటున్నారు. కొందరు బూట్లకుపాలిష్‌చేసి రోజుకు రెండూమూడూ సంపాదించుకుంటున్నారు. సమ్మెలోభాగంగా దత్తాసామంత్ 'జెయిల్ భరో' (జెయిళ్లనింపండి) అనే నాదం ఇచ్చినప్పుడు 10 వేలమంది కార్మికులు అసలే తిండిలేని కుటుంబాలను వదిలిపెట్టి రెండువారాలు జెయిలుకువెళ్ళారు.

ఈ మిలిటెన్సీ అగస్టు 18-20ల మధ్య పరాకాష్ఠనందుకుంది. అగస్టు 18న బొంబాయినగరంలోని పోలీసులు సమ్మెచేసారు. తమ యూనియన్ నాయకులను అరెస్టుచేసినందుకు నిరసనగా జరిగిన ఈ సమ్మెమీదికి ప్రభుత్వం సైన్యాన్నిదింపడంతో పరిస్థితి అల్లకల్లోలమయింది. రెండురోజులపాటు నగరంలో అంతర్యుద్ధ వాతావరణం నెలకొనింది. ఆకల్లోలంలో, అంతవరకు శాంతంగావుండిన బట్టల మిల్లుల కార్మికులు ప్రత్యక్షచర్యలకు ఒడిగట్టారు. RMMS అధ్యక్షుడు హోషింగ్‌ను కార్యదర్శి భోస్లేని, అంతులేప్రభుత్వం నియమించిన కమిటీలో సభ్యుడయిన భావు రావు పాటిల్‌ను, టార్గెట్లుగా తీసుకొని వారిఇళ్ళమీదికి దాడులుజరిపారు. వాళ్ళ భార్యాపిల్లలను పక్కకుతొలగమని వారించి ఇళ్ళను పద్ధతిప్రకారం ధ్వంసంచేసారు. హోషింగ్‌ఇంటిని కాలబెట్టడానికికూడ ప్రయత్నించారు. రెండురోజులపాటు నగరంలో కొన్నిప్రాంతాలలో దుకాణాలను లూటీచేసారు. జీతాలుపెరగడంవల్ల పారిశ్రామిక కార్మికులలో పోరాటచైతన్యం నశించిందన్న అబద్ధాన్ని బట్టబయలుచేసారు.

కార్మికులిట్లాగుంటే అవతల దత్తాసామంత్‌కు, ఇతర బూర్జువా రాజకీయ నాయకులకు, ఈ పోరాటం తమరాజకీయ మనుగడను తేల్చేవిషయంగా తయారయింది. బట్టలమిల్లు కార్మికులపట్ల కాంగ్రెస్‌ప్రభుత్వపు నిర్లక్ష్యవైఖరిని తమ ప్రయోజనాలకోసం వాడుకోవాలని ప్రతిపక్షనాయకులు ప్రయత్నిస్తే, కాంగ్రెస్ రాజకీయ నాయకులందరు ఓడడనికే ఇది దెబ్బఅన్న భయంపట్టుకుంది. 'RMMS నాయకుల పాపాలకు మేమంతా ఎందుకుపరిహారం చెల్లించాలి?' అని వాళ్ళప్రశ్న. బొంబాయి కార్పొరేషన్‌కుచెందిన 70 మంది మున్సిపల్ కార్పొరేటర్లు సమ్మె విషయమై ముఖ్యమంత్రి తమతోమాట్లాడాలని డిమాండ్‌చేస్తూ అసెంబ్లీలో ఒకనాడు బైఠాయించారంటే ఆవిషయం ఎంతతీవ్రమయినదో ఊహించవచ్చు. ప్రతిపక్షకార్మిక నాయకులుగూడ, వెనకబడ్డవాడు పాపాత్ముడన్నట్టు తలదూర్చారు. శివసేననాయకుడు బాల్‌థాకరేనుండి, ఉత్తరప్రదేశ్‌లో రైతునాయకుడిగా, తెలంగాణకొస్తే విప్లవాభిమానిగా, బొంబాయివెళితే కార్మికనాయకుడిగా, అవతారాలెత్తే జార్జిఫెర్నాండెస్ వరకు, అందరూ దత్తాసామంత్‌కు సమ్మెఎట్లానడపాలో సలహాలిచ్చినవాళ్లే, కార్మికుల తరఫున ఆయాచితంగా వకాల్తాపుచ్చుకొని ప్రభుత్వంతోమాట్లాడి పరిష్కార 'ఫార్ములాలు' మోసుకొచ్చినవాళ్లే. 37 ఏళ్ళుగా తాముసాధించలేకపోయినది సామంత్ ఎక్కడ సాధిస్తాడోనన్నభయం, ఒకవేళసాధిస్తే ఆ ఘనతలో పదోవంతయినా తాము దక్కించుకోలేక పోతారాఅన్నఆశ, వాళ్ళను కదిలిస్తున్నాయి. దత్తాసామంత్‌నుగూడ

వాస్తవానికి కార్మికుల పోరాటనెల్లువే మోసుకపోతోంది. "సమ్మెకొనసాగిస్తున్న మనత 95 శాతం కార్మికులకే దక్కుతుంది, 5 శాతం మాత్రమేనాది" అని అతనే అన్నాడు. బూర్జువాపాత్రికేయుల పరిభాషలో సామంత్ రాజకీయాలకు అతీతుడు. అంటే కార్మిక పోరాటాలను కేవలం ఆర్థికపోరాటాలుగా నడిపేదృక్పథం అతనిది, మాటమాత్రంగా నయినా శోషలిజాన్నిగురించి మాట్లాడడు. 1972లో కార్మికరంగంలో ప్రవేశించి ఇంజనీరింగ్ పరిశ్రమలోబలపడి ఇప్పుడు క్రమంగా ఇతరరంగాలకు విస్తరిస్తున్నాడు. సామంత్ విజయానికి ప్రధానకారణం, లీగలిస్టుపద్ధతులకు, పరిష్కార యంత్రాంగా లకు, సంక్లిష్టమయిన చర్చలకు, తావివ్వకుండ ప్రత్యక్షచర్యలకు పూనుకోవడం. దీని వల్ల కార్మికుల పోరాటకు ప్రముఖస్థానం ఇవ్వడంజరుగుతుంది. చిన్నవిషయాలమీద, పాక్షిక ప్రయోజనాలకోసం, సమ్మెలు జరపకుండ ఒకేసారి పెద్దడిమాండ్లు తీసుకోవ డం, దీర్ఘకాలిక సమ్మెలు చేపట్టడం, అతనికి కార్మిక రంగంలో సినీహీరో గ్లామర్ సంపాదించి పెట్టడానికి ఉపయోగపడ్డాయి. ఉదాహరణకు ఈ సమ్మెలో అతని డిమాండు, వేతనాలలో 250-400 రూపాయల పెరుగుదలకావాలని, రివిజనిస్టు కార్మిక నాయకులలాగా తన కళ్ళకు (లేదా మాస్కో కళ్ళకు) అభ్యుదయకారులుగా కనిపించిన వాళ్లు అధికారంలో ఉన్నప్పుడు వెనకడుగు వేయడం, మళ్లీ ముందడుగు వేయడం, ఇట్లాంటివి ఉండవు కాబట్టి కార్మికుల విశ్వాసాన్ని సులభంగా సంపా దించుకోగలిగాడు. తాను కాంగ్రెస్‌లో ఉన్నప్పుడు గూడ ఇతర INTUC నాయ కులలాగా ప్రవర్తించలేదు. కార్మికులపై తన ఆధిపత్యం శాశ్వతంగా నెలకొనడం తప్ప అతనికి వేరే లక్ష్యంలేదు. వేరే సిద్ధాంతమూ లేదు, నీతీ నియమాలులేవు. కార్మిక ఉద్యమంలో గుండాయిజానికి శివసేన తరవాత దత్తాసామంత్‌నే చెప్పుకోవాలి. గుండాయిజం మాత్రమేకాదు, శివసేన ఏపద్ధతులద్వారానయితే బొంబాయి నగరం లోని వెనకబడ్డ మహారాష్ట్రిలలో ప్రాభవం సంపాదించుకుందో, ఆ పద్ధతులన్నింటినీ శివసేనమీదే తాను ప్రయోగించాడు. అతని కార్మికసంఘం (మహారాష్ట్ర గిర్నీ కాంగార్ యూనియన్) ఊరేగింపులలో 'ప్రపంచ కార్మికులారా ఏకంకండి!' అనే కమ్యూనిస్టుల నినాదం పలసనే 'ఛత్రపతి శివాజీకీజై!' అనే శివసేన నినాదం ఉంటుందట. 'జీనా హైతో మర్‌నాసీఖో, కదం కదంపర్ లడ్‌నాసీఖో' అనే పోరాట నినాదం ఇస్తూనే, ఒక ట్రక్కులో శివాజీ దర్బారుకు నకల్ తయారుచేసి శివాజీవిగ్ర హాన్ని నిలబెట్టి దానికి పూలమాలలువేసి ఊరేగింపుతో తీసుకపోయారట. ఇదంతా మహారాష్ట్ర కార్మికుల జాతీయ సంస్కృతిని ప్రతిబింబిస్తుందని సంతోషించిన వారు లేకపోలేదు. కాని శివాజీ కేవలం మహారాష్ట్ర జాతీయ చరిత్రలో ఒక ప్రముఖ

వ్యక్తి మాత్రమే కాడు, శివసేన పుట్టిన తరువాత శివాజీ మహారాష్ట్ర జాతీయ సంకుచితత్వానికీ, ముస్లింవ్యతిరేకతకూ గూడ చిహ్నం.

సమ్మె భవిష్యత్తు గురించి చెప్పటం కష్టం. నిజానికి మొదట్లో మిల్లు యజమాన్లకు సమ్మె అంత అభ్యంతరకరంగా కనిపించలేదు. గోడౌన్లలో పేరుకుపోయిన సరుకుల నిల్వను వదిలించుకోవడానికి సమ్మెలు ఉపయోగపడతాయి. పనిలో పనిగా ధరగూడ పెంచవచ్చు. మరొక కారణం పత్తిధర. గత రెండేళ్ళలో, మహారాష్ట్రలోని పత్తి పండించే రైతులు రాజకీయంగా బలపడడంవల్ల పత్తిధర ఒక్కసారిగా 30 నుండి 50 శాతం వరకు పెరిగింది. సమ్మెజరిగి మిల్లులు మూతపడితే గిరాకీ తగ్గి పత్తిధర పడిపోతుంది. సమ్మె ఇంకా మొదలు కాకముందే, సమ్మె జరగగల దన్న వార్తవల్ల పత్తిధర 10-15 శాతం పడిపోయిందని EPW లో రాస్తూ అమృతా అబ్రహాం 1981 డిసెంబరులోనే అన్నారు. కాబట్టి మొత్తంమీద సమ్మెవల్ల మిల్లు యజమాన్లకు తొలిరోజులలో లాభాలు లేకపోలేదు. అయినా లాభాలు - అంతిమంగా నిల్వలనుండీ మారకం నుండీకాక అదనపు విలువ నుండి వస్తాయి కాబట్టి, అంటే కార్మికులు శ్రమచేస్తేనే యజమాన్లకు లాభాలు వస్తాయి కాబట్టి, మిల్లులు తెరవాలనే యజమాన్లకు ఉంటుంది. కాని దత్తాసామంత్ విజయం సాధించడం ద్వారా మాత్రం కాదు. మిల్లుయజమాన్లకూ, కాంగ్రెస్‌నేతలకూ, RMMS నాయకులకూ, అందరికీ కావలసింది అదే: మిల్లులు తెరవాలి, కాని దత్తాసామంత్‌ను నాశనం చేసినతరువాతే. మిల్లు యజమాన్లకొక దీర్ఘకాలిక పథకం గూడవుంది. కార్మికులు పూర్తిగా బలహీనపడి, ఓడిపోయి తిరిగి పనిలోకివస్తే, చాలాకాలంగా వాయిదాపడివున్న ఆధునికీకరణను ప్రవేశపెట్టి సగంమందిపైగా కార్మికులను ఖర్చులేకుండా పనిలోనుండితీసేసి ఇక శాశ్వతంగా కార్మికుల బెడదలేకుండా చేసుకోవచ్చు.

నిజానికి దత్తాసామంత్ కార్మికరంగంలో శాశ్వతంగా నిలవగలవ్యక్తి కాడు. కార్మికవర్గ దృక్పథం లేకపోవడమే కాదు, అతని యూనియన్లకు ఒకనిర్మాణంగాని, ఎదురుదెబ్బకు తట్టుకొని నిలబడగల పనిపద్ధతిగాని లేవు. అతను ఆధారపడేది కేడర్ మీదకాదు, తనగ్లామర్ మీద, కిరాయి గూండాలమీద. ఈ సమ్మెతో కాకుంటే ఒకనాడు దత్తాసామంత్‌కు బొంబాయి కార్మికరంగంనుండి నిష్క్రమించక తప్పదు. అయితే అతను బొంబాయికార్మికులకు వదిలివెళ్లే సందేశం ఒకటివుంటుంది. అది, లీగల్ పద్ధతులనూ లేబర్ ట్రిబ్యూనళ్ళనూ నమ్ముకోక తమపోరాటాలపై ఆధారపడి ముందుకుపోవడం. ఆ సందేశాన్ని అందుకోగలతరం బొంబాయి కార్మికులలో వస్తుందని ఆశిద్దాం.

# తొలికోడి కూసింది

వుప్పల నరసింహం

పొద్దంతా కూలికిపోయొచ్చి, అలసిపోయి ఇంట్లో ఆపనీఈపనిచేస్తున్న బాలమ్మకు ఏతోవెలితిగా తోస్తున్నది. ఏమిటి? అని తలచుకోగానే కోడిపెట్ట స్ఫురణకు వచ్చింది. జిట్టదికోడి- పూలపూలకోడి.... అమ్మో! కోడిఎక్కడపోయింది? ఏమైంది? ఏడున్నది! ఏది? ఏది??.... మనసులోఆరాటం- దాంతో గుండెలు జల్లుమన్నాయి, నరాల్లో రైళ్ళుపరుగెత్తసాగాయి, కడుపులో దడఎక్కువైంది- బుగులుబుగులు.... భయంభయం.... కార్జంవణుకుతుంది.... చెమటలుపడుతున్నాయి. ఇంకవేరే ఏమీఆలోచించలేకపోయింది- కంగారుగా అటూఇటూ తిరిగింది.

ఎందుకూ? అంటే అది ఆవూరిదొరకోడి- దొర పెంచడానికి ఇచ్చినకోడి- 'దొరకోడిపోయిందంటే ఇంకేమైనాఉందా? మీదిపాణాలు మీదనేపోతయ్, పాణాలన్నా నమ్మలంగపోతయా? ఎంతగోసనో? ఎంతబాధనో? ఏం కథనో? ఎన్నితిట్లో యిగఏంచేతురోతండ్రీ....' అనుకుంటూ బాలమ్మ పెరట్లోకివెళ్ళింది.

పిడకల కుప్పెనకింద, కట్టెలవాటున, చింతచెట్టుమీద, ఇంటివాసాలమీద "ఆఁ....ఆఁ....ఆఁ.... ప్పాప్పాప్పా...."అంటూ ఎక్కడైనా వుందేమోనని పిలుస్తూ వుంది- పెరట్లో కోడిఉలుకులేదు, పలుకులేదు.

"మ్యావ్, మ్యావ్"అంటూ పిల్లి నాలుకతో మూతితుడుచుకుంటూ తిరుగుతూ వుంది- అదిచూసి బాలమ్మకడుపులో 'దగడు' (భయం, ఆందోళన) మరింత ఎక్కువైంది.

'ఆయింత పిల్లిబొందకు పెట్టుకునేనాఏంది?' అనుకుంటూ కోడిబూరు ఎక్కడైన కనబడుతుందేమోనని నిశితంగా పెరటంతావెతికింది. కాని ఎక్కడా ఏమీకనిపించలేదు.

'ఇగనేను ఏంజేతునుల్లో.... దేనిఏశం మెడకుగట్టుకున్నట్లాయే.... రోజు ఈ యాళ్ళకు ఇంట్లకొచ్చి గంపకాడ కూసుంటుండే- ఇయ్యాల ఇంకారాకపాయే? ఎవలన్న పట్టుకబొయ్నరాఏంది? ఓలమ్మో! ఆకోడిపోతే ఏమున్నదున్నదాఇంత....దొర నానెత్తికొరిగిచ్చి, సున్నంబొట్లుపెట్టి ఊర్లెకేలి ఎలగొడ్తడు. ఎవరింట్ల మన్నువడే, ఎవరిసేతులకు గత్తరలేసే....' అనుకుంటూ బాలమ్మ తిరిగిఇంట్లోకొచ్చింది.

లోపలి అర్రి(గది)లోకూడా చూసింది- బల్లి 'కిస్సస్....'అంది గాని కోడి జాడలేదు. బాలమ్మచూపుల్లో, నడకలో ఆందోళనఎక్కువైంది

'ఇదెక్కడి బాదయిపాయెనుల్లో- అడ్డెడొడ్లకూలికిపోతే బుడ్డెదొడ్లు దుడ్డెమేశ్శె, అన్న శాస్త్రమయిపాయెనూ?.... ఇంటిముంగట ఇంతకోడీ, కుక్కవుంటె అక్కత్

బర్కత్ అనుకుంటే, ఆయింత పన్నితన్ని దాన్నిపట్టుకతిన్నట్టుంది. ఆకోడి నా దైనా పీడపోయిందని ఊకుంటుంటిగదా? బటాయిలెక్క పచేలుఇచ్చే.... రండ ముండవు, ఇంటిముంగల గొడ్డుగోద ఏమిలేదు, నువ్వు నీకొడుకేగదా? జిట్టకోడిని ఇస్త! తీసుకపోయి బటాయికీనడుపు.... నీకు ఇంటిముంగట కోడివున్నట్టుంటది, నాకు ఇంతబటాయి (ఉత్పత్తిలో భాగం) వొస్తది. దానికి నువ్వగింజలు బొంజలు ఏమిఎయ్యకున్నానడుస్తది, పెంటమీద అదే ఇన్నిఇత్తులు ఏరుకబుక్కుతది. నువ్వ యాల్లకు చూసిగంపకిందకమ్మి పొద్దుగాలఇడిస్తే అయిపాయే.... ఇంట్ల ఏమంత సుతారంపనుంది? కూసున్నదగ్గర నీకుబటాయివొస్తది. కాని యిమానంతోటి (న్యాయంగ) నడుపు- ఎన్నిగుడ్లుపెడితే అన్నిగుడ్లు పొదిగెయ్యి. నాలుగమ్మి, నాలుగు పొదిగెయ్యకు ఏమంటున్న? అట్లజేస్తివాంటే మల్ల ఊర్లెకనిపియ్యవు.... యిమానం తో సాదుకుంటే, నీఅదృష్టం మంచిగుంటే మల్లఈదినంకల్ల నీయింటినిండా కోళ్ళు కోళ్ళపో....' అన్నవిషయం గుర్తుకొచ్చింది. దాంతో మరింత భయంపెరిగింది.

మనసులో సుళ్ళుతిరుగుతూవున్న ఉద్వేగాన్ని అణచుకోలేక, గుండెలనిండా పొంగుకొస్తున్న కోపం, కసితో వీధిలోకివచ్చి

'ఎవలమీదమన్నుపోతు? ఎవలింట్ల దుమ్ముపోతు?.... దొరదెగ్గరనుంచి కోడి పెట్టతెచ్చి పదిహేనురోజులుగాకపాయె అప్పుడే దానిమీద ఎవల కన్నుపడెనోఏమో? ఆళ్ళకళ్ళళ్ళ దుమ్మువడ! మన్నువడ!....' అంటూ గుబురుచెట్లచాటున, పొదల చాటున, పాడుపడిన గోడలల్లో "ఆఁ....అఁ....ఆఁ క్కొ....క్కొ....క్కొ" అంటూ పిలువసాగింది.

కిరసనాయిల్ సీసపట్టుకుని కోమటి దుకాణానికి పోతున్న మదినవ్వ బాలమ్మను చూసి

"ఏంపోయిందొదినే? గట్లదేవులాడుతున్నవు?...." అని అడిగింది. "కోడి పోయిందే! తీసుకొచ్చి పదిహేనురోజులు కాలేదు. అప్పుడే ఎవలింట్ల మన్నువడ్డదో ఏమో? మందిసొమ్ము అపాలిచ్చుకుంతందుకు ఎప్పుడు' పంగి '(అదును) దొరుకు తదా? అనిసూస్తుంటరు, మంది 'రుభంల' బతికెటోళ్ళు.... "కోడికోసం చూస్తూనే ఉక్రోషంతోఅంది బాలమ్మ.

"ఎసుంటికోడి?"

"పూలపూలకోడి- మొన్న దొర దెగ్గర తెచ్చినకోడి...."

"అదా!.... ఆ దాదనగరి మల్లవ్వఇంట్ల ఆళ్ళకోళ్ళతోటి వొచ్చిందంట- ఇందాకనే మల్లవ్వ 'ఇది ఎవలకోడుల్లా మాకోళ్ళల్ల వచ్చిపన్నది?' అనిఅడిగింది- అప్పుడే నీ కోడిఅని యాదిరాలేదు వొదినే- 'ఏమో యెవలకోడో ఏమో' అన్న-ఆడనే ఉండొచ్చు సూడుపో- ఎందుకుఅంత 'హైబత్' తింటవ్? గింత ఏమన్న అయితే ఇంత పెద్దగ జేస్తవ్? ...."అంటూ మదినవ్వ చేతులు తిప్పింది.

కాస్త కుదుటపడ్డ మనసుతో "మరి ఏం జేతునే అది నాఇంటి కోడిఅన్నా గాక పాయె, పోతే ఇంతసేపు తిట్టి ఊకుంతందుకు...."అందిబాలమ్మ.

"నీకు నాకున్నంతఅగడు(ఆశ)- బుడ్డపైసచేతులుంటే పెద్దపైసి చెయ్యాలను కుంటవు. తొవ్వొంటి ఇంతకష్టపైపుల్లకూడ దక్కనియ్యవు, ఇంత పెండ దక్క నియ్యవు." బాలమ్మ పొదుపరితనాన్ని ఎత్తిచూపింది మదినవ్వ- అందులో వ్యంగం కూడా చోటుచేసుకుంది.

"ఏమోనే...."అని ఒక్కమాటలో బాలమ్మ కొట్టేసింది ఆవాదాన్ని.

"మల్లవ్వఇంట్లకు పోయేపటికె అదిదక్కింరి- ఇంకోరి ఇంకోరి ఇండ్లళ్ళకు పోతే అణగపడ్తురు. ఈపాటికీ బూరుమిగుల్తుందె" అని "పొయ్యిరాజేశ్నవావొదినే?" అడిగింది.

"ఇంకఏడనే? కూలికేలిరాంగనే ఇదే దేవులాడుడాయే-"

"పోమరి పోయి కోడినితీసుకరాపో- ఇంక నేన్‌గూడ పొయ్యిరాజెయ్యలేదు, కోమటాయనదగ్గర్కి పోయొస్త!...." అంటూ మదినవ్వ ముందుకునడిచింది.

'ఈకోడిఇంట్లపీసుగెల్ల! జెర్రసేపట్ల ఎంతపరేశాన్‌జేసేసూడు. కడుపుల దగడు ఇంకాపోలేదు.... మంచికోడేపుందమ్మ ఏమన్నగాని....' అనుకుంటూ మల్లవ్వ ఇంటికొచ్చింది.

వాకిట్లో మల్లవ్వ బియ్యంగాలిస్తూవుంది.

"మా కోడొచ్చినాది మల్లక్కా?" అంటూ బాలమ్మ పలకరించింది.

"ఎవలకోడోఏమో? మాకోళ్ళల్ల వచ్చిపన్నది- ఎసుంటిదే నీకోడి?" అంది తనపని కొనసాగిస్తూనే

"పూలపూలది జిట్టకోడి"

"ఆఁ.... గట్లనేవుంది. గా జొంపుకిందవున్నయ్‌సూడు" తలతిప్పిఅంది.

అరుగుమీద ఓమూలకు జాంపు కిందకోళ్ళు ఒకదాన్ని ఒకటి పొడుచుకుంటు న్నాయి. కయ కయ చప్పుడవుతుంది. బాలమ్మ ఆత్రంగా జాంపులేపట్టింది. మనిషి దగ్గరికి రావడంతో కోళ్ళుబెదిరి చప్పుడుచేస్తూ ఒకదానిమీద ఒకటిపడ్తున్నాయి. పక్కా పక్కా కూర్చుంటున్నాయి. దీపం వెలుతురులో తన పూలపూల జట్టకోడి కనిపించింది. బాలమ్మకు పెద్ద గండం తప్పినట్టనిపించింది. కాని కోడి మీదకోపం వచ్చింది.

'మంచిగున్నావమ్మ. రోజూ ఈడనేవన్నావు? నేన్ ఎంతదగడుతింటి....' అని కోళ్ళమధ్యనుంచి తనకోడిని చేయిపెట్టితీసింది. 'క్కొక్కొక్కొక్కొ' అంటూ కోళ్ళది ఒకటేగోల.

చేతిలో కోడినిపట్టుకుని మల్లవ్వ దగ్గరికివచ్చి "పొయ్యిరాజేసినావ్ అక్కా?" అని బాలమ్మ అడిగింది.

"ఇంకఏడనే పొద్దంత కూలికిపోయి గిప్పుడేవస్తి! ఆ కలుపుపాడుగాను ఇంతింత పెద్దచెల్లు మొలిశినయ్‌చేంట్ల. అవన్నిపీకేవరకు నాచేతులు 'ఇట్ల'ననిస్త రేవు" అంటూ చేతులు పైకిలేపబోయింది, కాని పూర్తిగాపైకిరాలేవు.

"నేన్‌గూడ వొచ్చిఏంపనిచెయ్యలేదు- పొయ్యిల బూడిదిగూడఎత్తలేదు- ఏడున్నపని ఆడనేవుంది." అని చేతిలోనికోడిని చూపిస్తూ "యిగో ఇదింత నన్ను పరేశాన్‌జేసింది. ఇదికన్పియ్యక పొయ్యేటాల్లకళ్ళు నాకడుపులకేలిదగడు లేశింది. దీన్నిదేవులాడెకళ్ళనే గీయాళ్ళయ్యింది. బావచేడాఅక్కా, కనిపిస్తలేడు?" అని అడిగింది బాలమ్మ.

"మీబావనా? ఏడ కల్లుదుకాండ్లకూసుండో?" అంటూ లేచిందిమల్లవ్వ.

"యిగనేన్ పోయొస్తఅక్కా" అంటూ బాలమ్మ ముందుకుఅడుగేసింది.

"మంచిదిపో...." అంటూ తనూఇంట్లోకివెళ్ళింది మల్లవ్వ.

బాలమ్మ ఇంటికొచ్చేసరికి కొడుకు శంకరయ్య గోనెతట్టు కొప్పెరపెట్టుకుని, తలపై కట్టెలమోపు పెట్టుకునివొచ్చాడు. తలపైమోపును వాకిట్లో ఓమూలపారేసి, మోపులోని గొడ్డలినిపైకిలాగి, ఇంట్లోకొస్తూ ఇంట్లో దీపంలేకపోవడంచూసి "యింక దీపంపెట్టలేదేమవ్వ" అని అడిగాడు తల్లిని.

"కోడి దానగరి మల్లక్కాఇంట్ల పోయిపన్నది. దేవులాడీ దేవులాడీ అక్కడిక్కడ తిర్గేటాకళ్ళ పొద్దుపోయిందిబిడ్డా...." అని గూటైవున్న దీపంబుడ్డిని వెలిగించి, గూనెపెంకమీదపెట్టింది.

శంకరయ్య తలపైనుంచి గోనెతట్టుతీసి కొయ్యకుతగిలిచ్చి, గొడ్డలి ఓ మూలకుపెట్టి జారాట్లో గోళెంలోనుంచి నీళ్ళుతీసుకుని కాళ్ళు, చేతులు, మొఖం కడుక్కుని, ఇంట్లోకొచ్చి దండెంపైవున్న రుమాలుపేల్కతో తుడుచుకోసాగాడు.

బాలమ్మ పొయ్యిపద్దడిడ్చి, పొయ్యిఅంటేసి, పొయ్యిమీద 'ఎసరు' పెట్టింది. తనువొచ్చేప్పుడు తీసుకొచ్చినగోంకెరాయ ఏరుతూకూర్చుంది.

మూలకున్న సాపచింపు, ఓ మెత్త(దిండు) తీసుకుని వాకిట్లో పరుచుకున్నాడు శంకరయ్య- పడుకుని ఆకాశంలో చుక్కలనుచూస్తూ చిరుతల రామాయణంలోని పాటఅందుకున్నాడు.

భజనమండలిలో చేస్తున్న భజన చిన్నగావినిపిస్తూంది. సారాయి దుకాణంవద్ద ఎవరో కొట్లాడుకుంటున్నారు. మీదివాడలో ఎవరో పిలుస్తున్నారు. గంగెద్దులవాని గంటచప్పుడు దగ్గరవుతూవుంది. ఓవైపు కుక్కలుమొరుగుతున్నాయి. ఇంటిముందు 'చీదు'లో చిమ్మెట్లు 'కీససససస'మని అరుస్తున్నాయి- మిడతలు 'కిసిక్ కిసిక్ కిసిక్'మని అంటున్నాయి. పెరట్లో చింతచెట్టుమీద గుడ్లగూబ అరుస్తూవుంది. గోరెంక పిట్టలు కలవరపడుతున్నాయి. ఒకటిరెండుకాకులు ఒకకొమ్మమీదినుంచి మరోకొమ్మ మీదికి ఎగురుతున్నాయి. సొన్నాయిల జాగయ్య తాళాలువాయిస్తూ "రేపుపొద్దుగాల పసుల దవాఖానకాడ రోగమొచ్చినకోళ్ళకు సూదులిస్తరో.... అందరు కోళ్ళను తీస్కరావాలో...." అంటూ తాళాలు వాయించాడు.

మబ్బులచాటుకు పోతున్న చందుర్ణ్ణి చూస్తూ, రకరకాల ఆకారాలతో కదులుతున్న మబ్బులను చూస్తూ ఆమధ్యనే ఆప్రాంతంలో ప్రచారంలోకివచ్చిన 'జన నాట్య మండలి' పాటల్లోని తనకుఇష్టమైన 'వొడ్డెరోళ్ళ' పాటను అందుకున్నాడు శంకరయ్య.

'వొడ్డెరోళ్ళసుంది మేము
ఇన్నాళ్ళ గుడ్డిగా బతికినా
ఎద్దోల్లం........
....... ....... ........."

మరోఒకటి రెండు పాటలు పాడాక

"తిందువులేవే బిడ్డ- పొద్దుగాల బుక్కెడంతతిన్నవే.... ఎంతఆకలయితుందో ఏమో? లేవే తిందువు.... "అందితల్లి వాకిట్లోకొచ్చి.

శంకరయ్యలేచి జారాట్లో నోరుపుక్కిలించి, ఊసివచ్చి దీపందగ్గర గోనె తట్టు వేసుకుని కూర్చున్నాడు.

బాలమ్మ రెండు కంచుగిన్నెల్లో అన్నంవేసుకుని తెచ్చింది. ఓపెద్ద చిప్పలో కూర వేసుకొచ్చింది తెడ్డుతో కొడుక్కుఇంతవేసి, తనూ ఇంత వేసుకుంది. ఆ మసక వెలుతురులో ఇద్దరూ తిన్నారు……………

పక్క వీధిలో కోడికూసింది. ఆతరువాత వరుసగా ఊరంతా కోళ్ళుకూసాయి. చెట్లపై ఒకటి రెండు కాకులు కొమ్మలు మార్చుతున్నాయి. కాపువారి వీధిలో గిలకల చప్పుడవుతోంది.

శంకరయ్య లేచి గోనెతట్టు కొప్పెర పెట్టుకుని బావిదగ్గరకు బయలు దేరాడు.

తెట్టున తెల్లారింది. అప్పటికే బాలమ్మ కోడిని విడిచిపెట్టి, వాకిలిఊడ్చి, పొయ్యిలో బూడిదిఎత్తి ఊడ్చి, రాతిరి కుండలను కడిగేసింది. బొక్కెన, కుండా తీసుకుని చేదబావిదగ్గరికిపోయింది. అప్పటికే బావిపద్ద చాలామంది నిల్చున్నారు....

నీళ్ళుతెచ్చి, వంటచేసి, తిని, కొడుకుకు'సద్ది' కట్టుకుని కూలికిబయలుదేరింది బాలమ్మ.

ఒకరోజు కూలికిపోయి ఒకరోజు పోకపోయినప్పటికీ పదిహేనురోజులు గడిచి పోయాయి. శంకరయ్యమాత్రం పట్టుపట్టి చిరుతలరామాయణంలోని పాటలమాదిరి జననాట్యమండలి పాటలు నోటికిబట్టీపట్టాడు.

ఈమధ్యన బాలమ్మ పూలపూల కోడిపెట్ట ఎప్పుడూ పుంజుపక్కనే తిరుగుతూ గింజలేరుకుని తింటూవుంది. మధ్యాహ్నంపూట కేరుతూవుంది. మిగతా కోళ్ళ మధ్యకు పోకుండా హుందాగా పుంజుపక్కన, లేకపోతే ఒంటరిగానే తిరుగుతూ వుంది. జారాట్లో అన్నంమెతుకులు ఏరుకబుక్కుతున్నకోడి కేరడాన్నిచూసి, అదో రకమైన ఆనందంలో "కోడిగుడ్లకొచ్చింది. ఎన్నిగుడ్లుపెడుతదో సూడాలే? జిట్ట కోడికదా బాగనేపెడుతుండొచ్చు- ఈముచ్చట దొరకుచెప్పాలె...." అనుకుంది బాలమ్మ.

బొంగురులేని, పగిలిపోనిగొంతుతో పూలపూలకోడి కేరుతూవుంటే ఆ చప్పుడు వినడానికి ఎంతోబాగుంది. అది ఏకంగా కేరుతూనే తిరుగుతూవుంది.

మరుసటిరోజు కూళ్ళకోసం దొరఇంటికి అందరితోపాటు బాలమ్మకూడా పోయింది. అందరికి కూళ్ళుఇచ్చినాక దొరవారు దశరథరామిరెడ్డి బాలమ్మనుద్దేశించి.

"కోడి. గుడ్లు పెడుతున్నాదేబాలి?...." అనిఅడిగాడు.

అరుగుకిందనిలపడి నేలచూపులుచూస్తూ ఒడియంగా, భయపడుతూ "నిన్న మొన్నటినుండి కేరుతుంది పటేలా...." అని సమాధానమిచ్చింది.

"మరి చెప్పకపోతివేమె?" అలవాటుప్రకారం మీసాలుమెలేస్తూ అడిగాడు దొరవారు. అరుగుమీద నగిషీలుచెక్కిన కుర్చీలోకూర్చుని. ఎడమకాలు కుర్చీమీద పెట్టుకుని హుందాగావున్నాడు.

అరుగుకింద పూలచెట్లమీద రెక్కలపురుగులు వాలుతూవున్నాయి. నేలమీద నల్లచీమలబారునుచూస్తూ "ఇయ్యాళ చెప్పేతందుకే వొచ్చినదొరా" అందిబాలమ్మ.

కుర్చీమీదినుంచి కాలుతీసి, కిందవున్న 'మాదిగ' చెప్పును తొడుక్కొని

"జెరమంచిగ సూసుకో. తొలుసూరి గుడ్లు అమ్ముకోకు. పొదిగెయ్యి ఏమంటున్నవే బాలి?...." హెచ్చరించినట్లు అన్నాడు దొరవారు.

"గట్లనేదొరా....' దించిన తల ఎత్తకుండానే అంది.

దొరవారు కుర్చీలోంచిలేస్తూ, తొడలవద్ద గోక్కుంటూ "మంచిదిపో...." అని లోపలిగదిలోకి పోయాడు.

బాలమ్మ తనతోటి వాళ్ళను చేరడానికిగాను గేటుదాటి, కావలిముత్యాలును తాగుబోతు మల్లయ్యను దాటి విరవిరా అడుగులేసింది.

మరో నాలుగు రోజుల తరువాత బాలమ్మ పొయ్యివద్ద వంటచేస్తూ వుండగా, కోడిపెట్ట కేరుతూ ఇల్లంతా మూలలను పరికిస్తూ తిరుగుతూవుంది. ఆవేళప్పుడు మేతకు పోకుండా ఇంట్లోనే తిరుగుతూవుందంటే, కోడి గుడ్లకొచ్చిందని బాలమ్మకు తెలిసిపోయింది. వెంటనే మెల్లిగావెళ్ళి గబుక్కున కోడిని పట్టుకుంది. కోడి అటూ, ఇటూ పరుగెత్తకుండా నిలుచున్నదగ్గరే కూర్చుడిపోయి లొంగిపోయింది. తీసుకెళ్ళి గంపకింద కమ్మింది బాలమ్మ.

అన్నంవండి, చారుచేసి, నీళ్ళుతెచ్చి, కొన్ని ఏరుపిడుకలు ఏరుకొచ్చి, తిని. తలవెంట్రుకలు దులుపుకుని ముడేసుకుని కూలికిపోవడానికి సిద్ధమవుతుండగా గంపకింద చప్పుడయింది. గంపలేపేసరికి కోడి గబుక్కున బయటపడింది. గోధుమరంగులో పెద్ద కోడిగుడ్డు....

బాలమ్మ మొఖం విప్పారింది. కళ్ళుమెరిసాయి. రెక్కలు విదుల్చుకుంటూ పెంటమీదికిపోతున్న కోడిని సంతోషంగా, తృప్తిగాచూసింది. వెచ్చగావున్న ఆ

గుడ్డును తీసుకుని, గంపకొయ్యకు తగిలించి, తైదల కుండలో గుడ్డును జాగ్రత్త పెట్టి కూలికి బయలుదేరింది.

పద్నాలుగు రోజులు కోడి వరుసగా గుడ్లుపెట్టింది. ఆ పద్నాలుగు రోజులు గుడ్డుతినాలన్న కోరికను బలవంతాన అణచుకున్నారు తల్లీ కొడుకులు. ఆ తరువాత కోడి 'కుడుకు' కూర్చుంది.

ఒకరోజు శంకరయ్య బావిపద్దనుంచి ఎండిన వరిగడ్డి తీసుకొచ్చి ఓపాతతట్టలో వేసాడు. బాలమ్మ అందులో పద్నాలుగు గుడ్లను గుండ్రంగాపెట్టి, వాటిపై కుడుకు కూర్చున్న కోడిని కూర్చోబెట్టింది.

రెండురోజుల కొకసారి గుడ్లమీది నుంచి కోడిని వదిలి నీళ్ళు, గింజలుపెట్టి గంట తర్వాత తిరిగి గుడ్లమీద కూర్చోపెట్టేది బాలమ్మ.

అమావాస్యకు ముందు పొదిగేస్తే, పున్నమి వచ్చింది. ఒకరోజు ఉదయం గంపకింద కోడిపిల్లల లేతకంఠాలు వినిపించాయి. ఇంట్లోనేవున్న శంకరయ్య ఆత్రంగా పైనించి గంపతీసిచూసాడు. కోడి మెడకింద రెండుపిల్లలు అరుస్తూ వున్నాయి. కోడినితీసి ఇంకెన్ని ఉన్నాయో చూద్దామనుకుని . కోడిని పట్టుకోబోతే ముక్కుతో పొడవసాగింది. ఒడుపుగా రెక్కలవద్ద పట్టిలేపాడు, మరో రెండు పిల్లలు వున్నాయి.

బాలమ్మ పొయ్యిపద్దనుండివచ్చి నాలుగు కోడిపిల్లలను బయటకుతీసి, వాటి పగిలిన గుడ్లను తీసేసింది. శంకరయ్య చేతిలోనికోడి, తన పిల్లలకు ఏమిఅపాయం జరుగనున్నదో అని గింజుకుంటూవుంది. వీలైనప్పుడల్లా ముక్కుతో శంకరయ్యను పొడవడానికి ప్రయత్నిస్తూవుంది. బాలమ్మ మిగతాగుడ్లను అలాగే పేర్చిపెట్టింది. సన్నటినూకలుతెచ్చి కోడిముందు పోసింది. తల్లీ కొడుకులు అక్కడున్నంతసేపూ పరిగి కంపలాగ తన పిల్లలచుట్టూ, గుడ్లచుట్టూ 'క్కొక్కొక్కొక్కొ' అని బూరంత నిక్కబొడుచుకుని మిడితిరుగుతూవుంది. వాళ్ళిద్దరూ అక్కడినుంచి కదిలాక పిల్లలు లేతకంఠాలతో అరుస్తూ తల్లిబుక్కినట్టు బుక్కడానికి ప్రయత్నిస్తూ వున్నాయి. తల్లినూకలను మరింత చిన్నగాకొరికి పిల్లలముందు పడేస్తూవుంది. ఆ ముక్కలను అవి కొరుకుతూవున్నాయి.

మరో రెండు రోజులకు మరిరెండు పిల్లలు వచ్చాయి. మిగతాగుడ్లు 'చీయ గుడ్లు' అయినాయి. బాలమ్మ ఆగుడ్లన్నింటిని చెవిపద్ద పెట్టుకుని ఊపిచూసి, లాభం

లేదసుకుని పెంటలోపారేసింది.

ఓచిన్న 'కంచుడు' (మట్టిమూడుకు)లో నీళ్ళుపెట్టి, నన్నటి నూకలను కోడి ముందు ప్రతిరోజు తల్లి కాకపోతే కొడుకు, కొడుకు కాకపోతే తల్లి పెట్టేవాళ్ళు. ఆ ఆరుకోడిపిల్లలు కంచుడుచుట్టూచేరి మూతులుముంచి, తలలుపైకెత్తి గుటగుట నీళ్ళుతాగేవి. అలా తలలుపైకెత్తినప్పుడు అవిచాల అందంగా కనిపించేవి.

ఓరోజు కూళ్ళకోసం దొర ఇంటికిపోతే, దొరవారు గచ్చులో పెద్దపీట (నాలుగు కాళ్ళ చెక్కబల్ల) మీద కూర్చున్నాడు. తనవైపు చూడకపోయేసరికి బాలమ్మ కొద్ది సేపు అలాగే నిల్చుంది.

దశరథరామిరెడ్డిదొర పరధ్యానంగా వాకిట్లోకిచూడగానే బాలమ్మ కనిపించింది. గచ్చులోనుంచే

"ఏందేబాలి? ఏమొచ్చినవూ?" అని అడిగాడు

"ఏంలేదుపటేలా. ఒక్కరోజు కూలివస్తేమన్నది" కాలి బొటనవేలుతో దగ్గరలో వున్న బోకెవంచును దూరంజరుపుతూ చెప్పింది.

"పెద్దజీతగాడులేడు, మల్లరాపో...."

"................" బాలమ్మ చప్పుడుచేయకుండా నిల్చుంది.

"ఏమె అట్లనేనిలవడ్తివి?" విసుగ్గా అడిగాడు.

"కోడి పిల్లలజేసింది పటేలా...." భయం భయంగానే అన్నది.

దొరవారిమొఖంలో మార్పుకనిపించింది. కుతూహలంతో

"ఎన్నిపిల్లలజేసిందే?" అడిగాడు.

ఏమంటాడోఏమో? ఏమంటాడోఏమో? అని మనసులో బుగులుతోనే "ఆరు పిల్లలజేసింది పటేలా.... యెనిమిది శియ్యగుడ్లు అయినయ్" అంది.

దశరథరామిరెడ్డి మొఖంలో కనిపించినమార్పు మాయమయింది. తిరిగి విసుగు, కోపం చోటుచేసుకున్నాయి. అనుమానంతో

"ఎనిమిది 'చియ్యగుడ్లు' అయినయా లేక ఆరేపొదిగేసినవానే?" అడిగాడు.

"నా యిమానంగ పటేలా పదిమీద నాలుగుపొదిగేసినా" అంది.

ఇక ఏమిఅనలేక దశరథరామిరెడ్డి

"ఇగఏంజేస్తవుపో. ఇమానం, ప్రిమాణం డినవడ్తివి, యిగనమ్మాలె నమ్మకుంటె నడుస్తదా?" నిష్టూరంగా మాట్లాడాడు.

నిజంచెప్పినా దొరనమ్మకపాయె అని మనసు కష్టపెట్టుకుంటూ అక్కడినుంచి బాలమ్మ కదిలింది.

కోడిపిల్లలు నెలరోజులపాటు ఇల్లు, వాకిలివదిలి దూరంపోయేవికావు. ఆ తరువాత పెంటలపైకి పోసాగాయి. కోడిపిల్లలతో బయటికెళ్ళిందంటే బాలమ్మకు గద్దలతో బయముండేది. కోడిపిల్లలమీదికి పోయినందుకుగాను కుక్కకాలు విరగగొట్టింది. పిల్లిని ఎప్పుడూ బెదిరిస్తూవుండేది.

మరోరెండునెలలు గడిచాక కోడిపిల్లలు కాస్తపెద్దగయ్యాయి. తల్లిని ఎడబాయకున్నా, తల్లిరెక్కలకింద పొదగకున్నా, అప్పుడప్పుడూ స్వతంత్రించి అటూ ఇటూ తిరిగినా మళ్ళీ తల్లిచుట్టూతిరిగేవి.

ఒకరోజు ఉదయం పొయ్యింట్లో బాలమ్మ వంటచేస్తూవుంటే ఓకోడిపిల్ల కయకయమంటూ ఇంట్లోనే తిరుగుతూవుంది. మిగతా పిల్లలతోపాటు పెంటమీదికి పోవడం లేదు. కనురెప్పలుమూస్తూ, బలవంతానతెరుస్తూ, కునికిపాట్లుపడుతూ నిల్చున్న స్థలంనుంచి జరగటంలేదు. కోడిపిల్ల పరిస్థితినిచూసి బాలమ్మ గుండెలు జల్లుమన్నాయి. మనసులో ఏదోమూల భయం. పెంచిపెద్దచేసిన ప్రేమ, కళ్ళముందే ఆరాటపడుతున్నందుకు బాధ....

ఎల్లిపాయ (వెల్లుల్లి) దంచి, కోడిపిల్లనుపట్టుకుని, దాన్నోట్లోవేసి నీళ్ళు పోసింది బాలమ్మ. క్యావ్ క్యావ్‌మని కోడిపిల్ల అరుస్తూనేవుంది. బాలమ్మఏదో గులుగుతూనే, ఏదేదో అనుకుంటూనే కోడిని గంపకిందకమ్మింది. ఆతర్వాత ఇంట్లో పనులన్నిచేసి, కూలికివెళ్ళింది.

కూలికిపోయినా మనసంతా కోడిపిల్లమీదనేవుంది. సాయంత్రం కూలినుంచి తిరిగొచ్చి గంపలేపి చూసేసరికి ఏముంది? కోడిపిల్ల చచ్చిపోయి పడివుంది. గండుచీమలు పట్టివున్నాయి.

బరువెక్కిన బాలమ్మగుండెల్లో దడ, భయం, బుగులు. ఒళ్ళంతా చెమటలు పట్టాయి, కళ్ళల్లోకి నీళ్ళుదునికాయి.... దొర దశరథరామిరెడ్డి చూపులు, అరుపులు. పొన్నుకర్ర.... పగిలీలకుర్చి.... పాటాకు.... కాపలిముత్యాలు.... బరిసెకర్ర.... దొరదర్బారు.... కచ్చడం.... చర్నకోల.... ఎలితెబరిగె.... కళ్ళముందుకదిలాయి. దుఃఖం మరింతపొంగుకొచ్చింది.

కోడిపిల్లలకు పట్టిన చీమలను దులిపి, ఒడిలోవేసుకుని, మిగతా కోడిపిల్లలను కోడినికమ్మి పొద్దుగుంకుతుండగా దొర దగ్గరికి చేరింది.

బయటగేటువద్ద కావలి ముత్యాలు బరిసెకర్రి పక్కకుపెట్టుకుని కూర్చున్నాడు. లోపల వరండాలో నాలుగైదు కుర్చీల్లో దొర స్నేహితులు, చుట్టాలుకూర్చున్నారు- మధ్యలో దశరథరామిరెడ్డి.

మాట్లాడుతూ మాట్లాడుతూ అరుగుక్రింద నిల్చున్న బాలమ్మనుచూసి అక్కడి నుంచే "ఏందేబాలి, ఏమో ఒచ్చినవూ ?" దొరతనం ఉట్టిపడేలా అడిగాడు.

ఎట్లచెప్పాలె ? ఎట్లచెప్పాలె ! అని చేతులుపిసుక్కుంటూ ఓ క్షణం దొరవైపు చూసి తిరిగి నేలచూపులుచూస్తూ ఆలోచిస్తూ, నీళ్ళు మింగుతూవుంది.

ఎత్తుగా కనిపిస్తున్న ఒడినిచూసి, చప్పుడుచేయకుండా నిలుచున్నవైనంచూసి దొరకు ఏదో అనుమానం కలిగింది. కాని ఆ అనుమానాన్ని గొంతులో పలికించకుండా "ఏందే ?.... ఒళ్ళోఏమో తీసుకొచ్చినవూ ? ...." అడిగాడు.

'చెప్పేతందుకు దొరనే ఒకదారి సూపిచ్చిండు' అని మనసులో అనుకుని భయపడుతూ, భయపడుతూ, వొణుకుతూ ఒడిలోనుంచి చచ్చినకోడి పిల్లనుతీస్తూ "కోడిపిల్ల సచ్చిపోయింది దొరా నీ కాల్మొక్త.... పొద్దుగాల మంచిగుండే, అంబటాళ్ళకు సుస్తయింది. సుస్తయిందని ఎల్లిపాయ దంచిపోసి, గంపకిందకమ్మి కూలికి పోయొచ్చేటాకళ్ళనే సచ్చిపోయింది. దొర నీబాంచనైత ఇంత్ల నాదోస (తప్పు)మేమిలేదు...." అంది కోడిపిల్లను అరుగుమీదపెడుతూ

తనచుట్టూ స్నేహితులు, చుట్టాలువున్నారు. వాళ్ళముందు తానుకోళ్ళను బటాయికి ఇస్తున్నవిషయం తెలియడం దశరథరామిరెడ్డికి ఎందుకో బాగనిపించలేదు. దాంతో పండ్లు పటపటమంటున్నా. మనసులో కోపంపొంగుతున్నా. ఎంతోఅసహ్యమున్నా అవన్ని బయటకు కనిపించకుండా అల్లాటప్పా సంగతిలా తీసిపారేస్తూ

"సస్తే సచ్చిందిపో...." అని నవ్వుతూ తనస్నేహితులవైపు తిరిగాడు.

బాలమ్మ ఆశ్చర్యపడింది- ఆశ్చర్యం సంగతి ఎలావున్నా మనసునిమ్మళమయింది. గుండెలనిండా ఊపిరి పీల్చుకున్నట్టనిపించింది, కళ్ళల్లో పోయిన మామూలుకాంతి తిరిగొచ్చినట్టయింది. ఎన్నితిడుతడో ? ఎన్నికొడుతడో ? ఏం బాధనో? ఏంగోసనో? ఏంకథనో? అనుకుని వణుక్కుంటవచ్చిన తనకు దొర ఒక్కమాటతో 'అంతాతీరిపోయింది' అనుకుంది. మనసులోనే దొరకు ఓదండంపెట్టి సచ్చినకోడిని తిరిగి ఒడిలోపెట్టుకుని, ఒడిగొదిగి గేటుదాటి, ఇంటికిచేరింది.

ఇంటికొచ్చేసరికి తనకొడుకు, పరాంకతను అరుగుమీద కూర్చున్నారు. విచారంగా వొస్తున్నతల్లినిచూసి

"ఏడికిపోయినవే?........" అని అడిగాడు శంకరయ్య

"దొర ఇంటిదాకపోయిన"

"ఎందుకూ?"

"ఓ కోడిపిల్ల నచ్చిందిబిడ్డా" అని ఒడిలోనుంచితీసి చూయించింది.

శంకరయ్య నొచ్చుకున్నట్లు 'చ్చొ....చ్చొ....చ్చొ....' అన్నాడు.

కొడుకుపక్కన కూర్చున్న అతన్నిచూస్తూ "ఎవరికొడుకుపుబిడ్డా" అని అడిగింది, పరిశీలించిచూస్తూ

"ఈ ఊరుగాదు- అటు దూరం.... అప్పుడప్పుడు బాయికాడికివొస్తడు- ఇయ్యాల మనింట్లనేఉండుమని తీసుకొచ్చిన...." శంకరయ్య

"అయ్యో.... తీసుకొస్తే తీసుకొచ్చినవ్ తియ్ బిడ్డా- బుక్కెడు బువ్వనేగదా.... బంగారమా? భాగ్యమా తినేది?...." ప్రేమగాఅంది బాలమ్మ

"ఆ నచ్చినకోడిని పారెయ్యక పోయినవే?" శంకరయ్య

"పారేస్త, పారేస్త...." అంటూ బాలమ్మ పొయ్యింట్లోకి పోయింది.

శంకరయ్య, తనతోవచ్చిన కామ్రేడ్ నారాయణకు దొరవారు తమకుకోడిని ఎలాబటాయికి ఇచ్చింది? ఇస్తే తిరిగిఎలాఇవ్వాలి? ఆకథ కమామిషూ అలలా విపరించి చెప్పాడు. నారాయణకు ఆవిషయం విచిత్రమనిపించింది. ఆ తరువాత దొరకు గ్రామప్రజలకుమధ్యవున్న సంబంధాల గురించి, దొరగారు ఏఏరంగాల్లో ఏవిధంగా దోచుకుంటున్నది అన్నవిషయంపై చాలాసేపు చర్చించుకున్నారు. భోజనాలైయ్యాక కొత్తపాటలు ఎన్నో పాడుకున్నారు.

* * * * *

ఊర్లో వరికోతలు జోరుగాసాగుతున్నాయి. తీరికలేకుండా ఆడకూలీలు పొద్దటకూళ్ళకు పోతున్నారు. స్నానాలుచేయడానికి, బట్టలు ఉతుక్కోవడానికి, ఇళ్ళుఅలుక్కోవడానికి తీరికలేకుండా పనులవొత్తిడి ఎక్కువగావుంది. బావులమీద జీతగాళ్ళు సరిగ్గా నిద్రపోకుండా పనులుచేస్తూ వున్నారు. ఏ బావిమీదచూసినా వరికళ్లాలు, బంతులుకట్టడం, వడ్లను తూర్పారపట్టడం, పొలియో పాటలు.... ఇంతా పూర్తిగా ఎండని వరిగడ్డి తీయటివాసన....

బాలమ్మకూడా పొద్దటికూళ్ళకు పోతూంది, నెత్తి 'మాసిం'ది, బట్ట'మాసిం'ది. అయినా అవన్నీ పట్టించుకోకుండా రాత్రి తినిపడుకునేందుకు ఇంటికొస్తే, మిగితా సమయమంతా పొలాల్లోనే గడిచిపోతుంది.

ఒకరోజు చీకటిపడ్డాక పెద్దతట్టలో కూళ్ళగింజలను తలపై పెట్టుకుని ఇంటికొచ్చింది. అరుగుమీద కోళ్ళచప్పుడు వినిపించలేదు. ఎక్కడయినా దూలాలమీద, వాసాలమీద పడుకున్నాయేమోననుకుంది. కాని మనసులో అనుమానంగానేవుంది, దాంతో దీపం వెలిగించి రోజూకోళ్ళుండే స్థలంలో చూసింది.

బాలమ్మ తన కళ్ళను తానేనమ్మలేకపోయింది. నోటెమ్మట మాటరాలేదు, తన మీద ఎవరో పగపట్టినట్టనిపించింది. మొఖంలో రక్తంగడ్డకట్టుక పోయినట్టయింది. గుండె వేగంగా కొట్టుకోసాగింది. నరాల్లో రక్తంగాక మరేదో పాకినట్టనిపించింది.... ఒకటికాదు, రెండుకాదు నాలుగు కోడిపిల్లలు చచ్చిపోయివున్నాయి. అందులో రెండు పుంజులు, ఇప్పుడిప్పుడే తలలపై జుట్లు పెరుగుతున్నాయి. మిగితా ఒకపిల్ల, తల్లి చావు బతుకుల్లో వున్నాయి. నిలుచుండి. నిలుచుండే గిర్రునతిరిగి పడిపోతూవుంది తల్లికోడి. తిరిగి నిలబడుతూవుంది.

బాలమ్మదీపం క్రిందపెట్టి మనసులోంచి తన్నుకొస్తున్నదుఃఖాన్ని పెదవుల మధ్య బిగపట్టి, ఉద్వేగంతో గజగజలాడుతూ, రెండుచేతులు తలకు పెట్టుకుని, చచ్చిపోయివున్న కోడిపిల్లలను చూస్తూ "....ఇగనేన్ ఏంజేతురా తండ్రి. గాలికి పోయే కంపనెత్తికి సుట్టుకున్నట్టాయె.... ఒకగద్దను, పిల్లిని, కుక్కనురానీయకుంట బంగారం లెక్క సాదితే ఆఖరికి నామెడకు ఉరిదెచ్చినయి గదరా తండ్రీ.... ఇగనేన్ ఏంచేద్దు? ఎక్కడపోదు??...." ఏడుస్తూకూర్చుంది.

కొద్దిసేపులగినాక ముక్కుచీది, చనిపోయిన నాలుగు పిల్లలను ఒకదాంట్లో కమ్మి మిగతారెండింటిని ఒకగంపకిందకమ్మి వంటచేయకుండా, తినకుండా అలాగే పడుకుంది. ఆరాత్రి శంకరయ్య ఇంటికిరాక బావివద్దనే వడ్లకుప్పవద్ద కావలి పడుకున్నాడు.

పొద్దునలేచి దీపరితీసేందుకు కోళ్ళగంపల దగ్గరికిపోయేసరికి, కోడిబారు అక్కడక్కడ పడివుంది. భయంతో, కంగారుగా మొదటి గంపని లేపనెత్తింది.... తల్లికోడిలేదు, కోడిపిల్లచచ్చిపోయివుంది. తల్లికోడి బారుకొంత గంపకిందపడివుంది. బాలమ్మకు ఎవరినితిట్టాలో, ఎవరిని కొట్టాలో ఎవరిమీద మన్నుపొయ్యాలో తెలి

యక ఉద్వేగంతో, కసితో, ముంచుకొస్తున్న ఆవేశంతో మరోగంపను లేపట్టింది అందులో ఒకపిల్లలేదు. బోరున దుఃఖంవచ్చింది. ఏడ్చింది. గుండెలుగుద్దుకుంది, శోకంపెట్టింది, కసిగాతిట్టుకుంది, తిట్టింది.

ఒకదగ్గరమూడు, మరోదగ్గర ఒకటి కోడిపిల్లలు పడివున్నాయి. దగ్గరలో ఒకటి రెండు రక్తపుచుక్కలు ఆరిపోయివున్నాయి.

'....నాఇల్లు మునిగింది.. నానోట్లెమన్నుపడ్డది.... యిగనేన్ ఏగుట్టలపొంటి పోను, ఏవాగులపొంటిపోదు.. అని ఎక్కడపోయినా దండుగనే. పోయిదొరతాళ్ళ మీదనేపత్త ఏమన్నగాని....' అనిబాలమ్మనిర్ణయించుకుంది.

చచ్చిన నాలుగు కోడిపిల్లలను ఓ తట్టలోవేసుకుని దొర దశరథరామిరెడ్డి 'బంగ్ల'కు చేరింది. బయట గేటువద్ద ఎవ్వరూలేరు. పాటాకుతీసేవుంది. ప్రాణం మంతా బిగపట్టుకుని, సవాలక్షఆలోచనలు మెదడులో మెదులుతుండగా 'ఏమంటడో? ఏంతంటో....' అనుకుంటూ అరుగువద్దకొచ్చింది.

కావలిముత్యాలు పంచెలో కర్రిఇరుకిచ్చుకుని వినయంగావంగి చెప్తున్న విషయాన్ని వరండాలో ఆరాముకుర్చీలోకూర్చొని దొరవారు దశరతరామిరెడ్డి చిరాగ్గా వింటున్నాడు, అప్పుడప్పుడు కనుబొమలు ముడేస్తూవున్నాడు. గౌడసంఘంవాళ్ళు ఈఏడు తనసుకాదని 'మామ్లా' పట్టడానికిపోయారన్న విషయం తనని దహించి వేస్తుంది. అందుకే చిరుబురులాడినట్టుగా వుంది మొఖం.... ముత్యాలు చెప్తున్న విషయాలు ఓచెవుతో వింటూ అటూ, ఇటూ చూస్తున్నాడు. అరుగు కింద గంపతో బాలమ్మ కనిపించింది. 'అదేం కథ ఎత్తుకొచ్చిందో?....' అని మనసులోనే అనుకున్నాడు.

బాలమ్మ నీళ్ళులేక వాడిపోయిన అందంకాయ (సొరకాయ) పాదు ఆకులా మారింది. ఆమె మొఖంలో జీవంలేదు, కళ్ళకింది గుంతల్లో నల్లటి ఛాయలు.... మెడలో నాలుగు 'గుండ్లు' కూడాలేకుండా బోసిగావుంది. తడారిపోయిన పెదవులు తెల్లబడ్డాయి. మట్టి కొట్టుకపోయిన జుట్టు, బట్టలు, ఆకారం పూర్తిగాదీనంగావున్నది.

ముత్యాలు చెప్పిన సంగతులన్నీ విన్నాక ఆరాము కుర్చీలోంచి లేచి, ద్వారానికి కట్టిన ఎంబ్రాయిడరీ గుడ్డను చేయితో జరిపి అరుగు మీదికొచ్చాడు.

దశరథరామిరెడ్డి తన దగ్గరికి రాకముందే

“....పటేలా.... దొరా నీ కాల్మొక్త.... బాంచనైత.... నా యిమానంగ నేను

కపటంలేకుంట కోళ్ళనుపెంచిన- గద్దలను, కుక్కలను, పిల్లులను రాకుంట దినాం కాపాడిన, ఆఖర్కి నా నసీబ సక్కగలేక రోగమొచ్చి గప్పుడు ఓకోడిసచ్చింది- ఇప్పుడు మొత్తానికి మొత్తం అన్నికోళ్ళు సచ్చినయ్...." అని గంపను చూయించి, దూరం నుంచే దొరకాళ్ళకు బయపడుతూ మొక్కింది బాలమ్మ

'....అన్నికోళ్ళు సచ్చినయ్....' అనేసరికి దొరవారి కనుబొమలు ముడుచుకున్నాయి, అప్రయత్నంగా ముక్కుపుటలు కదిలాయి, ఓచేయి మీసాలపైకి కదిలి మీసాలనుమెలేసింది.. పిల్లుకుట్టు (నెహ్రూషర్ట్) లోనుంచి గుండెపొంగడం, తగ్గడం కనిపిస్తూవుంది. సన్నటిదోవతి చెంగును ఓచేత్తో పట్టుకుని మరో రెండుఅడుగులు ముందుకేసాడు, ముందుకొంగి గంపలోకి తొంగిచూసాడు.

సచ్చినకోడిపిల్లల కళ్ళుమూసివున్నాయి, కాళ్ళు జీవంలేక పడిపోయాయి, అందులోరెండు కోడిపిల్లలతలపై జుట్టుపెరుగుతూవుంది. ఇప్పుడిప్పుడే స్పష్టిగా బయారపుతున్నాయి. దొరవారు గంపను మార్చి మార్చిచూసి

"నేనిచ్చిన కోడిపెట్ట. పూలపూలకోడి కనిపిస్తలేదేమేఇంట్ల? అడిగాడు.

బాలమ్మగుండెల్లో పదగండ్లు పడ్డట్టయింది. సచ్చిన కోడిలేకపాయే ఏమంటాడో? అని భయపడుతూనే, అనుమానంతో రెండుచేతులుజోడించి పబ్బతిపట్టి

"....పటేలా నీకాల్మొక్త, నేనబద్దంఆడ్తలేను, సచ్చిన కోడివాసనకు ఏ కుక్కవొచ్చిందో, నక్కొచ్చిందోగాని గంపకిందికెలి ఎత్తుకపోయింది. అట్ల తల్లి కోడిపోయింది, ఇంకోపిల్లపోయింది....అంది.

దశరథరామిరెడ్డి గుండెల్లోనిరక్తం ఒక్కసారి మొఖంలోకిచిమ్ముకొచ్చి మొఖమంతా ఎర్రగైంది, కళ్ళు మరింతఎర్రగయ్యాయి.. గౌడసంఘంవాళ్ళు రాజేసిన కోపం, బాలమ్మతీసుకొచ్చిన సమాచారంతో మరింతపెరిగింది. చస్తే అన్నికోళ్ళు ఒకేసారిచస్తాయా? చస్తే అందులో తల్లికోడినే కుక్కఎత్తుకపోవాలా? కుక్కఎత్తుకపోయేంతవరకు ఏంచేసినట్టు? ఇలా ప్రశ్నించుకుంటే దొరవారికి ఎక్కడో మోసం జరిగిందనిపించింది. గౌడ సంఘం వాళ్ళు తనసుకాదని 'మామ్ల'కుపోయి ఎలా మోసంచేశారో, బాలమ్మ కూడ పూలపూలకోడిని అమ్ముకుని, పిల్లలను దొరకెందుకు కియ్యాలె మందుపెట్టిసంపుత అని చంపివుంటదని దొర మనసులో పొగలా నిండిపోయింది. దాంతో,

"నిజంగనే కుక్కెత్తుకపోయినాదే?...." అడిగాడు వ్యంగ్యంగా

"నాయిమానంగ పటేలా, నా కొడుకుతోడు.... బటాయికిచ్చిన పూలపూల కోడి సచ్చింది, రాతిరి కుక్కెత్తుకపోయిందో? ఇంకేది ఎత్తుకపోయిందో సూడలేదు" అని బాలమ్మ చెప్పింది. అంతే....

దశరథరామిరెడ్డి పక్కననిల్చున్న కావలి ముత్యాలు చేతిలో నుంచి బరిసెకర్రి లాక్కుని "ఎవనికి నేర్పిస్తున్నవే నీయమ్మ తాశిలిమొఖంల.... ఎక్కతినేదాన, కోడిని ఏడనో అమ్ముకుని సచ్చిందని వచ్చినావ్, నీతల్లి.... నీ కులాన్ని ఎవడు నమ్మిండే.... మీదికేలియిమానం, ప్రమాణం, కొడుకుతోడు లింటావ్?...." అంటూ బలంగా తొడలమీద రెండుదెబ్బలు వేసాడు.

బాలమ్మ ఆదెబ్బలకు తాలలేక లబలబ మొత్తుకుంటూ కిందకూలబడిపోయింది. దొరవారి కోపం చల్లారలేదు.... బాలమ్మ పబ్బతిపట్టి దొరకు మొక్కుతూ "కోడిని అమ్ముకోలేదు పటేలా. గంత బెయిమాన్ దాన్నికాను దొరా.... నీ కాల్మొక్త కొట్టకుండ్రి.... నీకు దండంజేస్త...." అంది.

చేసినతప్పుచాలక పైనుంచి 'కొట్టకుండ్రి' అంటదా? అని దశరథరామిరెడ్డికి మరింత కోపంవచ్చింది. దాంతో మరో నాలుగు కర్రిదెబ్బలు వీపుపైపడ్డాయి. దెబ్బలను తప్పించుకునేందుకు చేసిన ప్రయత్నంలో రవికెముడి విడిపోయింది. వీపులో చిరిగింది, కొంగు జారిపోయింది. రొమ్ములు నగ్నంగా బయటపడ్డాయి రెండు చేతులతో గుండెలను దాచుకుంటూ కూర్చుండిపోయింది బాలమ్మ.

కావలిముత్యాలు నిస్సహాయంగా, రాయిలానిలబడిపున్నాడు. దారినపోయే వాళ్ళు గేటువద్దఆగి, చోద్యంచూస్తున్నట్టు నిల్చుండిపోయారు. వారిలో పిల్లలు, స్త్రీలే ఎక్కువమంది పున్నారు.

దొరవారి అరచేయి ఎర్రగయింది. కొద్దిగా మంటలేచింది, కసితీరా ఆఖరి దెబ్బ ఒకటివేసి కర్రిదూరంగా విసిరేసి "ఫో దొంగముండ ఫో.... కావలోనితోని దండుగపైసలు ఇరువైరూపాలు పంపిచ్...సదూ, ఇంక ఈడ కన్పిచ్చెయ్యద్దు...." అని కావలి ముత్యాలువైపుతిరిగి "దానిఎంబడిపోయి పైసల్ తీసుకరారా!...." అని గబగబఇంట్లోకి వెళ్ళిపోయాడు. ముత్యాలు సరేఅన్నట్టు మౌనంగా, వినయంగా భయంతో తలడిపాడు,

బాలమ్మ కుమిలి కుమిలి లోలోపల ఏడుస్తూ కొంగు బుజాలమీదుగా చుట్టుకుని నోటికి అడ్డంగా పెట్టుకుని మెల్లిగాలేస్తూ, ఒక్కసారి దొర పోయినవైపుచూసి 'వీని

ఇంట్ల ఉన్నవదా, వీనిచేతులకు చెదలుపట్ట....' అని మనసులోనేతిట్టుకుని తలకిందికేసుకుని ఇంటిదారిపట్టింది. కావలిముత్యాలు మౌనంగా ఆమెను అనుసరించాడు.

నడువలేక, నడువలేక అడుగులో అడుగువేస్తూ, నరాలన్నిబిగపట్టుకుని ఇంటికిచేరి, ఎందుకైన అక్కరకొస్తదని పెట్టెలోదాచిన పదిహేనురూపాయలుతీసి, మిగతా ఐదురూపాయలు 'గల్లగుర్గి' పగలకొట్టితీసి ముత్యాలుచేతిలో పెట్టింది. కావలిముత్యాలు కళ్ళళ్ళకు నీళ్లుతీసుకుని మెల్లిగా దొర బంగ్లకునడిచాడు.

దశరథరామిరెడ్డి బాలమ్మను కొట్టాడన్నవిషయం ఊరంతటికీ తెలిసిపోయింది. కుర్రకారు కర్రెలుతీసుకుని ఎగిరారు. ముసలివాళ్ళు, అనుభవజ్ఞులు నిదానంగా చుట్టలుకాలుస్తూ ఆలోచించి ఆపారు, బతిమాలారు, గదవలుపట్టుకున్నారు, కడుపులో తలలుపెట్టారు, అప్పటికీ కొంతచల్లబడ్డారు యువకులు.

శంకరయ్యకు బాయిమీదనే విషయంతెలిసి ఇంటికి పరుగెత్తుకొచ్చాడు. ఇంట్లో ఓమూల చింపులచాపమీద తల్లి మెల్లిగా మూల్గుతూపడుకుంది. రొప్పుతూవచ్చిన శంకరయ్య తల్లిపరిస్థితినిచూసి ఏడ్చినంత పనిచేసాడు. శరీరమంతా నిమిరిచూసాడు. వీపులో నల్లగసారికలు, కమిలిపోయినదెబ్బలు, ఒళ్ళంతా వెచ్చగాకాలుతుంది. చిరిగిపోయిన రవికె.... శంకరయ్య మనసులో అగ్నిజ్వాలలు లేచాయి. రక్తం సముద్రపుపోటెత్తింది. ప్రతీకారం తీర్చుకోవాలన్న ఆరాటం, కసి బయలుదేరింది.

కొడుకు మానసిక పరిస్థితిని గమనించి బాలమ్మ కొడుకును దగ్గరికి పిలిచి "నన్ను ఆడు కొట్టిండని నువ్ వాని 'తెరువు'కు పోకుబిడ్డా! వాడు ఇస్పపురుగు. రాళ్లైపడ్డా వానిపగపోదు.... వానితోని నువ్ కంటపెట్టుకోకు. నేను ఇయ్యాలగాకపోతే రేపునచ్చేదాన్ని. నువ్ ఇంకనాల్గొద్దులు బతికేటోనివి, నువ్ వాని జోలికిపోకు బిడ్డా! నామాటిను. నువ్ వాని కంట్లెపడకు...." అని గదవ (గడ్డం) పట్టుకుంది.

శంకరయ్య కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

బాలమ్మను చూసేందుకు ఆ వాడవాళ్ళు, తెలిసిన వాళ్ళు వస్తువున్నారు. పోతున్నారు. ఎవరికి తోచినమాట వాళ్ళు చెప్తున్నారు.

సాకలి మైసయ్య, తెనుగు బాలయ్య కాపు మల్లారెడ్డి ఇంకా ఇద్దరు ముగ్గురు సంఘంతో సంబంధమున్నవాళ్ళు వచ్చి బాలమ్మను చూసి, కొద్దిసేపు ఉండి శంకరయ్యను పక్కకుతీసుకపోయి

"ఏంజేద్దాం ?" అని అడిగారు.

శంకరయ్య మౌనంగా ఆలోచిస్తూ కూర్చున్నాడు.

మల్లారెడ్డి గొంగడి సర్దుకుంటూ "పోయి అడుగుదాంపా. అడగకుంటె ఇట్లనే అలుసైపోతది. ఇంతదాక ఏమిజేసినా, ఎట్లజేసినా ఎవలు అడుగలేదు, గను కనే ఇష్టమున్నట్లు నడిపిస్తున్నడు. ఎదురుపడి అడిగితె ఇంతదనుక అయ్యేదికాదు. ఇన్నిదెబ్బలు తగిలేయేకావు. అసలు ఇది ఊరా? పాడా? అని అడుగుదాంపా...." అన్నాడు.

సాకలి మైసయ్య కాల్చినచుట్టను ఆర్పేస్తూ పొగబయటికి ఊదుతూ "....మనం ఇద్దరం ముగ్గురంపోతె బాలక్కకు పట్టినగతే అయితది. ఇట్లపోతే లెక్కగాదు...." అన్నాడు.

"అవును అదిగూడ నిజమే" తెనుగు బాలయ్య కల్పించుకున్నాడు.

"మరెట్లజేద్దాం?" ఆ గుంపులో ఎవరో ప్రశ్నించారు.

"ఊర్లె అందరిని ఇసారిద్దాం. ఊరన్నాక మంచోళ్ళు ఉంటరు, చెడ్డోళ్ళు ఉంటరు.... గందుకనే అందరికి ఎరుకయితే మంచిగుంటది...." మైసయ్య అన్నాడు.

అందరి చెవులపడ్తే ఒకడు అటుపీకుతడు, ఒకడు ఇటుపీకుతడు. అదికాదు, ఇదిపోదు. పదిమందిల పాముసావది...." అన్నాడు మల్లారెడ్డి.

"బడితెకట్టె అందుకుంటె పాముగాదు, పాముఅయ్యగూడ సస్తది, నువ్వే మనుకుంటున్నవ్?" మైసయ్య.

"నేనుగూడ గదేఅనుకుంటున్న బడితెకట్టె అందుకోవాలని" అని మల్లారెడ్డి వత్తిపలికాడు.

"బడితెకట్టెతోని కొట్టాలనుకుంటె పసరుగూడ గావాలెగదా?"

"మైసయ్యకాక చెప్పింది నిజమే, ఏదిజేయాలన్నా పంగిగలువాలె. పంగి గలిస్తేనే పనయితది...." తెనుగుబాలయ్య తీర్పుచెప్పినట్టుఅన్నాడు.

ఆ అభిప్రాయంతో అక్కడి వాళ్ళందరూ అంగీకరించారు. రాత్రికి అంద రిని కలిసి, విషయంవివరించి, తప్పుఎవరిది? అనిప్రశ్నించి అందరిని కూడకట్టుకుని దొరవారిని నిలదీయాలని నిర్ణయించడం జరిగింది.

పక్కింటి నాగమణి గంజి కొంతతెచ్చి బాలమ్మకు తాగించి, పక్కనేవుండి ఏమికావాలో కనుక్కుంటూవుంది.

శంకరయ్య ఆపూట బావికాడికి పోలేదు. ఇంట్లోనే ఆలోచిస్తూ జననాట్య మండలి పాటలు మననంచేసుకుంటూ కూర్చున్నాడు.

సంధ్యవేళ దాటింది. పశువులు కొట్టాలకుచేరుతున్నాయి. నారాయణ, శంకరయ్య బావివద్దకు వెళ్ళేసరికి ఉదయం జరిగినసంగతి తెలిసింది, దాంతో ఆలోచిస్తూ శంకరయ్య ఇంటికొచ్చాడు.

దీపం వెలుతురులో ఓ మూలపడుకున్న బాలమ్మ కనిపించింది. ఆ పక్కనే కూర్చున్న శంకరయ్య నారాయణనుచూసి 'నమస్తే'చేసి తల్లిదగ్గరికి తీసుకెళ్ళాడు. దీపంవెలుతురులో బాలమ్మకుతగిలిన దెబ్బలనుచూసి నారాయణ తల్లడిల్లిపోయాడు. కళ్ళల్లోకి కసి, కోపం, క్రోధం పొంగాయి. అయినా తమాయించుకున్నాడు.

శంకరయ్య, మైసయ్య, బాలయ్య మిగతా నలుగురైదుగురు ఊర్లో వీధి వీధి తిరిగి తెలిసినవాళ్ళను, జీతగాళ్ళను, కూలిపనిచేసేటోళ్ళను, దుడ్డె దుడ్డె పోరగాళ్ళను వాళ్ళను, వీళ్ళనుతీసుకుని స్కూలుకాంపౌండ్‌లో కైసిడకు కూర్చుండబెట్టారు.

యిగ అందరొచ్చినట్టే అన్నా...." అన్నాడు శంకరయ్య, నారాయణను ఉద్దేశించి

నారాయణ, మైసయ్యకు చెప్తున్న విషయంఆపి, వచ్చిన వాళ్ళను చూసాడు ఇరవైఐదుమంది వరకు వున్నారు. అందులో చాలామంది యువకులు కనిపించారు.

కామేడ్ నారాయణ గొంతుసవరించుకుని, పక్కనేవున్న రాయిమీదకూర్చుని "ఇట్లా మనం మీటింగ్ పెట్టుకోవడం ఈ ఊర్లె ఇదే మొదటిసారి అనుకుంట. ఇయ్యాల గాకున్నా ఇంక రెండురోజులకైనా ఇలాంటి మీటింగ్ పెట్టుకోక తప్పని పరిస్థితులను మన దశరథరామిరెడ్డి దొర కల్పిస్తున్నడు.... పదిహేను రోజుల కింద మొక్కజొన్నచేను బర్లుమేశినాయని కుర్మ వెంటయ్యను కొట్టిండు. ఎవరు ఎనక ముందు లేరని, దొరతోని పగపెట్టుకోవద్దని ఊకుంటిమి. అంతకుముందు బాయికాడ కోడిగుడ్లు పోయినయని జీతగాణ్ణి చెట్టుకుకట్టేశికొట్టె. అప్పుడు ఎవరన్న 'ఎందుకు కొట్టినవ్ పటేలా?' అని అడిగినమా. అడుగలేదు! మొన్నకిమొన్న బిడ్డపెండ్లికి అప్పుతీసుకపోయి ఇంతవరకు అస్సలులేదు, మిత్తిలేదని గేటుపెట్టి మాదిగ నాగయ్యను కొట్టినా ఏమనకపోతిమి. ఇయ్యాల కోడీ సచ్చిపోయిందంటే లేదు అమ్ముకున్నావని బాలక్కను కొట్టె, రేపు మైసయ్యనో, మల్లారెడ్డినో కొడుతడు, ఎల్లుండి ఇంకొకర్ని కొడుతడు ఇట్లా అదుపు, ఆజ్ఞలేకుంట ఇష్టమున్నట్టు, చీమునెత్తురులేనోళ్ళను కొట్టి నట్టు కొడుతనేవుంటడు, మనం సకుతనే ఉంటమా?...." అని ప్రశ్నించాడు.

"ఆఎన్కటి ఎడ్డికాలం బోయింది. తిడితెనెపడొద్దు- కొడితే ఎందుకు పడాలె?...." అన్నాడో యువకుడు.

"అవును నిజమే? తిడితెకూడ పడొద్దు.... కాని దొరచేతుల వందల ఎకరాల భూమి వుంది, పశువులున్నాయి, నాగళ్ళున్నాయి, ట్రాక్టరుంది, పైసవుంది...."

నారాయణ ఇంకేదో చెప్పబోయేలోగా ఇంకో యువకుడు అందుకుని

"అదికాదుసార్, ఆ భూమిల నాగలికట్టకుంటె ఎట్లపండిస్తడు? పశువుల తలుగులు ఇప్పకుంటె అవిమేతమేస్తయా? ట్రాక్టరు నడుపకుంటె నడుస్తదా?.... ముందుగాల మనం అంతా ఒక్కపట్టుగావాలె, ఒకణ్ణీతంతుంటె ఒకడు దూరం దూరం కేలిపోతుంటడు...." అని అందరిని పరికించి చూసాడు- నారాయణ మనసులో తృప్తిగా నవ్వుకున్నాడు ఆ మాటలకు.

"అవునాఁ ఒకణ్ణొకడు ఇసారిచ్చుకోకుంట తిరిగినంతకాలం గట్లనేఉంటరు అందరు. ఒకసంఘంపెట్టుకోని, నలుగురుకూడి ఇసారిచ్చుకుంటే పనులయితయ్, ఊకనే కమ్మంటె అయితయా?...."అని అడిగాడు మైసయ్య.

శంకరయ్య వింటూకూర్చున్నాడు.

"అట్లైప్పుడో మరి సంఘంపెట్టుకుందాం...." అన్నాడు ఆ యువకుడు.

"అందరి నోటినుంచి ఆమాట రావాలెగదా?" అందరినిచూస్తూ అన్నాడు నారాయణ.

"ఎవరిమనసుల ఏముందో చెప్పుండ్రిమరి...." అన్నాడు మల్లారెడ్డి.

"మంచిగనే వుంటది" అనికొంతమంది- అస్సల్ సంఘంబెట్టాలె, సంఘం పెట్టుకునేదాక కాదు. అనికొంతమంది తమ అభిప్రాయాలుచెప్పారు.

"సంఘంఅన్నకాడ ఒకరు పెద్దఉండాలెగదామరి." శంకరయ్య అన్నాడు.

"నిజమె- ఒకరు అన్నివిషయాలు చూసుకునేటట్టుఉండాలే"అని "మైసయ్యను ఆ పనిలపెడితె మంచిగుంటదనుకుంట...." అన్నాడు నారాయణ.

"నాకైతే సమ్మతమే...." అన్నాడు తెనుగుబాలయ్య

"అందరికి ఇష్టమే...." అన్నాడు ఓయువకుడు అందరితరఫున మాట్లాడుతూ

మైసయ్యను దగ్గరికి పిలుచుకుని కూర్చుండపెట్టి "మైసయ్యనే అన్ని చూసుకుంటడని ఊకోవద్దు, అందరు ఎవరిపని వాళ్ళు చేసుకుంటూపోవాలె, ఏదైనా

విషయముండంటె, మంచిచెడ్డ ఉంటె మైసయ్యనుకలువాలె, మాట్లాడాలె, అందరిమాట తను ఇనాలె, తనమాట అందరుఇనాలే...." అన్నాడు నారాయణ.

"మరి రేపటిసంగతేందో మాట్లాడుండ్రి" గుంపులోనుంచి ఒకతనుఅన్నాడు.

"మన మైసయ్యకాకనే చెపుతడు ఏంచెయాల్నో" అన్నాడు శంకరయ్య

మైసయ్య సర్దుకునికూర్చుని. కొంతసిగ్గుపడుతూ, అందరివైపు ఓసారిచూసి,

"రేపు పొద్దుగాల ఇక్కడ పున్నోళ్ళమేగాకుంట, ఇంకొంతమందిని ఆడోళ్ళ, మొగోళ్ళను దొరబంగ్లకాడికిపోయి అడుగుతాము. అప్పుడు ఏమంటడోసూద్దాం. దానిమీదికేలి ఎట్లఅనేది మనంఆలోచనజేసి ముందుకుపోదాం" అన్నాడు.

ఆ పద్దతే అందరికీ నచ్చింది అట్లనేజేద్దాం, అట్లనేజేద్దాం అని అందరూ నారాయణకు చెప్పి ఎవరింటికి వాళ్ళు బయలుదేరారు. శంకరయ్య, మైసయ్య, నారాయణ, మల్లారెడ్డి ఇంకొద్దిసేపు చర్చించాక అక్కడ నుంచి బయలుదేరారు. నారాయణ ఆరాత్రే మరో ఊరికి ప్రయాణమయాడు.

సారాదుకాండ్ల దొర పేరుచెప్పుకొని చెప్పిసారాతాగి, రేపు ఊరికి పోవడానికి గాను బమరూపాయలు దొర దగ్గర అడుక్కుందామని దొర బంగ్లకుపోతున్న తాగుబోతు మల్లిగానికి స్కూల్ కాంపౌండ్ నుంచి దుడ్డెదుడ్డె పోరగాళ్ళు, ఖీతగాల్లు ఎల్లడంచూసి, 'ఇదెందిరో....' అని కళ్ళు ఓసారి నలుసుకోని పరీక్షగా చూసాడు చూస్తేఏముంది?

"....అక్లెట్ల అయితది అడుగాలె, బరాబర్ నిలపెట్టి అడుగాలే, ఎగురుతే, దుంకుతే మందు మనదెగ్గర వుండెనెపుండే...."

ఇట్లా అనుకుంటూపోతున్నాడు.

తాగుబోతు మల్లిగానికి గుండెజల్లుమన్నది "....అయ్యాఇదేదో మంచుకొచ్చె టట్టేవుంది···· ముండ కొడుకులు మీటింగ్ పెట్టినట్టేవుంది.... జల్దిపోయి దొర శెవుల ఏసి ఇనాం అడుక్కుంట' అనుకుని తన ఉనికిని తెలియనీకేలా గొంతు సరాయించు కుంటూ, దగ్గుతూ దారివెంట నడుస్తున్నాడు.

తాగుబోతు మల్లిగాని గొంతుచప్పుడు వినగానే అందరూ మాటలు బంద్ జేసి ఏమీ తెలియనట్టుగా ఎవరి దారినవాళ్ళు చీకట్లో కలిసిపోయారు.

దమ్ముపట్టి వచ్చిన మల్లిగాన్ని చూసి దొరవారు

"ఏందిరా? గట్లఉరుకొస్తున్నవు?.... అఁ ఏంది. ఏమైంది?" అడిగారు.

తాగుబోతు మల్లిగాడు దొరవారి చెవిలో తానుచూసింది, చూడంది, ఒకటికి రెండు కల్పించి చెప్పాడు.

దొర మొఖంలో కొంత ఆందోళన కనిపించింది. కనుబొమలు ముడిపడ్డాయి. కాని ఎంతోసేపు అవి ముడిపడిలేవు.

ఓక్షణం తర్వాత దొర కాలుమీద కాలు వేసుకుని

"ఏజేస్తర్రా ఆళ్ళు దద్దమ్మలు.... మీరంత ఎందుకున్నర్రాపురి నాదగ్గర గిసుంటి పక్తలనేగద మీతోనిపని.... నువ్వేమి గాబరపడకు రేపయితే తయ్యార్గ వుండు...." అని మరో మాట మాట్లాడకుండా మల్లిగాడు పైసలు అడిగేందుకుకూడ వీలులేకుండా ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

తాగుబోతు మల్లిగాడు ఊరికిపోయే కార్యక్రమం మానుకుని ఇంటిదారిపట్టాడు.

శంకరయ్య ఇంటికిచేరేసరికి అప్పటివరకు కూర్చున్న నాగమణి తనఇంటికి వెళ్ళిపోయింది.

తొలికోడికూసింది. గోరుకోయలు కనిపించకుండా అయ్యాయి. పడమరన చందమామ కనిపించి కనిపించనట్టుగున్నాడు. ఆ కొద్దిసేపటికి ఊరు ఊరంతా మేల్కొన్నది.

చాలామంది జీతగాళ్ళు, రైతులు బావులకాడికిపోలేదు. చెల్కలకు ప్రయాణం కాలేదు. చుట్టలుకాలుస్తూ చూరులకింద, అక్కడ ఇక్కడ కూర్చున్నారు.

మైసయ్య ఇంకోఇద్దరు యువకులను వెంటవేసుకుని వీధి వీధితిరిగి అందరిని కామునికంత దగ్గరికి రమ్మంటూవున్నాడు. ఆడవాళ్ళు, మగవాళ్ళు, పిల్లలు, ముసలోళ్ళు అందరూ కామునికంతవైపు నడుస్తున్నారు. మైసయ్య బాలమ్మఇంటికొచ్చి బాలమ్మనులేపాడు. కొడుకు శంకరయ్య బుజంమీద ఓచేయి, తనబుజంమీద ఓ చేయి వేసుకుని మెల్లిగా కామునికంతకు నడిపిస్తున్నాడు మైసయ్య.

బాలమ్మనుచూస్తే పానంలేనిదానిలా అయింది. దారెమ్మటి ఆమెనుచూస్తూ అందరూ "అయ్యోపాపం" అని జాలిపడ్డారు.

బాలమ్మను ముందునడిపించుకుంటూ పోతూవుంటె వెనకాల కర్రలుపట్టుకుని యువకులు, గొంగళ్ళు బుజాలమీదవేసుకుని ముసలివాళ్ళు తలలమీదినుంచి కొంగు లేసుకున్న స్త్రీలు, బరిబాతలపిల్లలు నడుస్తూ దొర బంగ్లకుచేరారు.

గేటువద్దఉన్న కావలిముత్యాలు ఇంతమంది జనాన్నిచూసి నోరుతెరిచాడు. దొర బంగ్లకు ఇంత 'మందికూడి' ఎప్పుడురాలేదు. ఇంతమందిని ఒక్కసారి చూడగానే కళ్ళు చెదిరిపోయినయ్. అందరికన్నాముందు మెల్లిగానడుస్తున్న బాలమ్మను చూసి నాక "ఆ.... ఇదేదో పెద్దగనే అయేటట్టుంది" అనుకుని లోపలికిపోయాడు.

లోపలగట్టులో స్నానానికి సిద్ధమయిన దొరదగ్గరికిపోయి కంగారుగా "ఊరు ఊరంత మన బంగ్లముందువొచ్చింది పటేలా...." అన్నాడు.

"రానీయరాదురా మనల్నేంపీకుతరు- నువ్వుపో- నీపనినువ్ నూసుకోపో" అన్నాడు దశరథరామిరెడ్డి చెంబుతో తలపై వేడినీళ్ళుపోసుకుంటూ

కావలిముత్యాలు ముత్యాలుతోపాటు అంతవరకు ఇంట్లోనేవున్న తాగుబోతు మల్లిగాడు మరోఇద్దరు కట్టెలుపట్టుకుని సిద్ధమై బయటకు అరుగుమీదికొచ్చేసరికి జనం గేటుదాటి లోపలికివస్తున్నారు.

ఎవరైన ముత్యాలునుద్దేశించి "దొరవున్నాడుమామా?" అని అడిగాడు మైసయ్య

ముత్యాలు ఓపక్కకు నిలబడుతూ "ఉన్నడుబిడ్డా!" అన్నాడు. మల్లిగాడు మరి ఇద్దరుకూడా ఆపక్కన నిల్చున్నారు.

బాలమ్మను కింద ఓపక్కకూర్చుండపెట్టి నిలుచున్నారు మైసయ్య, శంకరయ్య, వాళ్ళదగ్గరలోనే కుర్మబీరప్ప, గొల్లమల్లయ్య, యువకులు, స్త్రీలు ఏదేదో మాట్లాడు కుంటూ నిల్చున్నారు.

ఆ కాంపౌండ్‌లో మట్టివాసన, చెమటవాసన, నిండిపోయింది- ఎవ్వరినోరు ఊరికేలేదు, అందరూ ఏదోఒకటి అంటూవున్నారు. మాటలసముద్రంలావుంది అక్కడ.

ఓ ఐదునిముషాల తరువాత దొరవారు తెల్లబట్టలేసుకుని, కిర్రుకిర్రుమని చెప్పులచప్పుడవుతుండగా బయటకొచ్చాడు- అంతమంది జనాన్ని చూసేసరికి కళ్ళు చెదిరాయి, ఎంతోమందిచేతుల్లో కర్రలు, మరెంతోమంది కళ్ళల్లోకసి. కోపం- ఇంకెంతోమంది నిలువెత్తు మండుతున్న ఆకారాలుచూసి ఒకింత గుండెజల్లుమన్నది. ఎంత ధైర్యంతెచ్చుకున్నా గుండెల్లో ఓమూలభయం, బుగులు పుడుతూనేవుంది.

అయినా తొణకకుండా బెణకకుండావచ్చి అరుగుమీద నగిషీలుచెక్కిన కుర్చిలో కూర్చున్నాడు అందరినిచూస్తూ

అంతవరకు లొడలొడమన్న నోళ్లన్నీ మూతపడ్డాయి. అంతా నిశ్శబ్దంగా నిల్చున్నారు. మెల్లిగా బాలమ్మ మూల్గులే వినిపిస్తున్నాయి.

మైసయ్య రెండుచేతులు జోడించి "దండంపటేలా...." అన్నాడు. మైసయ్య వెనకనిల్చున్న యువకులకు మైసయ్య మీద కోపమొచ్చింది దండంపెట్టినందుకు.

మైసయ్య పెట్టినప్పుడు తాము దండంపెట్టకుంటె మంచిగుండదని ఇద్దరు ముగ్గురు ముసలోళ్ళు చేతులుజోడిచ్చి "దండం పటేలా" అన్నారు. శంకరయ్య పటేలును మింగేసెటట్టు చూస్తావున్నాడు.

దశరథరామిరెడ్డి చేతిగడియారం చూసుకుంటూ "దండం దండం" అని గొణిగాడు, దొరవారు తన మనుషులకు కనుసైగచేశాడు. అందరిని ఒకసారి చూస్తూ "ఏంసంగతిరా మైసయ్య అందరు కట్టగట్టుకొని ఒచ్చిండ్రు?...." అని తన దొర దర్పంతోనే అడిగాడు.

కావలి ముత్యాలు, మల్లిగాడు, మిగతాఇద్దరు అరుగుదిగి గేటువద్దకు నడిచారు.

"ఏముందిపటేలా.... బాలక్క గోసనూడలేక, ఆగోస మీకు సూపిద్దామని తీసుకొచ్చినం...." అన్నాడు నెమ్మదిగా

మావోడు బాగనే మాట్లాడుతున్నడు అనుకున్నారు యువకులు

"నాకుసూపిస్తే ఏమొస్తదిరా, దాని పాపంఅది కుడుస్తున్నది. ఎవనిపాపానికి ఆదే బాధ్యుడైతడు గని ఇంకోడైతడా?"

"బాలక్క ఏంపాపం జేశింది దొరా నాకుతెలువక అడుగుత...." అని కుమ్మరి వీరప్ప గొరెల్రిను అటకాయించినట్టు అడిగాడు.

"తెలువక ఎందుకడుగుతవ్‌రా, తెలిశె అడుగుతవ్, అడుగు...."

"తెలిశేఅడుగుతున్నడనుకుని చెప్పరాదుపటేలా" వెనకనుంచి ఎవరో యువకుడు

దశరథరామిరెడ్డికి అరికాలిమంట నరుర్రిన నెత్తికెక్కింది.

"ఎవడ్రావాడు?...." అన్నాడు దొర.

"ఎవడైతే నీకెందుకు, నువ్ శెప్పేదేందో చెప్పరాదుపటేలా" ఇంకోయువకుడు

బాలమ్మ మూల్గుతూనేవుంది. శంకరయ్య తల్లిమీద ఎండపడకుండా చాటుగా నిల్చున్నాడు.

తొండముదిరి ఊసరెల్లి అయిందని దొర మనసులో అనుకున్నాడు. ఓక్షణం ఆగుంపువైపు తీక్షణంగాచూపి

"పంచాదు పెట్టుకుంతందుకు వొచ్చిండ్రారా ?" దొర

"మేం ఏంపంచాదు పెట్టుకుంటం పటేలా మీతోటి- బాలక్క తప్పేదో బాలక్క కొంగుల కట్టామని వొచ్చినం- ఎందుకు గంతగసం కొట్టిండో తెలిస్తే నలుగురం ఇంక నాలుగు ఆమె నెత్తిమీద ఏద్దామని వొచ్చినం...." మైసయ్య వ్యంగ్యంగా అన్నాడు.

దొరకు అర్థమయిపోయింది. మేకపోతు గాంభీర్యంతో

"అంత బందవస్తుతోటి వచ్చిండ్రిన్నమాట" అన్నాడు.

"ఇండ్ల బందవస్తు ఏముంది పటేలా ? కత్తులు కటార్లు తీసుకొచ్చుకున్నామా? ఏమన్ననా?...." అన్నాడు గొల్లమల్లయ్య

"ఓహో.... కత్తులు కటార్లకాడి కొచ్చిందన్న మాట కత....?

ఎవరో ఏదో సర్దిచెప్పబోయారు. దొరనే అడ్డుపడి

"మీసంగతేందో నేను తర్వాత జూసుకుంటగాని...." ఏదో చెప్పబోయాడు. "ఆ సూసుకునేదేందో ఇప్పుడే సూసుకోరాదు పటేలా- మీలకిట్లనే వున్నంగా...." అన్నాడు ఓ యువకుడు. మైసయ్య అడ్డుపడి "దొరని చెప్పనియ్య రాదుండ్రి...." అన్నాడు- దాంతో జనంలో కొంత చప్పుడు తగ్గింది.

దొర చెప్పడం ప్రారంభించాడు.

"కోడిని బటాయికిచ్చిన...." ఎవరో కిసుక్కున నవ్వారు- ఆ తరువాత దొర అటుఇటు కోపంగచూసి తిరిగి ప్రారంభించాడు "....బటాయికిచ్చిన కోడి భయంతోని సూసుకోవాలెగద- సూసుకోలేదు- పిల్లలు రోగమొచ్చి సచ్చినయని తీసుకొచ్చింది- తల్లికోడిని తీసుకరాలేదు, ఆకోడిని ఏడనో అమ్ముకుని మెల్లిగ నాదగ్గరి కొచ్చింది- కోడిని బటాయికిఇస్తే ఇంక రెండుకోళ్ళు ఎక్కువొస్తయనుకుంటె ఉన్న కోడిని ఊద్చుకతిన్నది. గట్ల ఊద్చుకతింటె కోపంరాక ఏమొస్తది ?...."

"కోడిని ఊడ్చుకతింటె జుల్మాన ఎయ్యనుంటివి- నీఇష్టమున్నట్టుకొడ్తవా?" అన్నాడు యువకుడు

'ఎక్కడి నుంచి వొచ్చింది ఇంత ధైర్యం ఈ ముండకొడుకులకు ? చాల చాల నీల్గుతున్నరు- గత్తరలేశినట్టు లేశిందేమి' అనుకున్నాడు దొర- ఊరి ప్రజల పరివర్తనకు చిరెత్తుకొచ్చింది. 'వేలెడంతలేని ముండాకొడుకులు తన అధికారాన్నే ఎదిరిస్తున్నారని మండిపడ్డాడు- కిందకూర్చున్న బాలమ్మమీద విపరీతమైన కోపం

వచ్చింది. ఎవ్వరులేకుంటే తన్నితగిలెయ్యాలన్నంత మంటగావుంది. ఆఖరికి మనసంతా కకావికలమై మొండికెత్తాడు దొరవారు.

"అవునుకొట్టినరా ఇప్పుడేంది?" అన్నాడు.

"ఈకొట్టుడు, కోదండంఎక్కిచ్చుడు ఇయ్యాలకొత్తగకాదు ఈ బంగ్లకాడ. అవన్ని అట్లనడిశిపోయినయ్. చెలాంచిపోయింది. యిగ ఇప్పటినుంచి అసుంటిదేం నడువది. ఎవడన్న తప్పుజేస్తే నలుగురినిపిలిచి కాదనిపియ్, అంతేగాని కొట్టేదిలేదు. బాలక్కనుకొట్టినందుకు తప్పయిందని ఒప్పుకోవాలె, దండుగతీసుకున్న పైసలు తిరిగిచ్చేయాలె!...." అన్నాడు మైసయ్య దొరను, జనాన్నిచూస్తూ

దశరథరామిరెడ్డి గుండె ఆగినంతపనయింది. కళ్ళల్లో జీవంలేకుండపోయింది, నాల్కెపై తడారిపోయింది, మనసునిండాభయం, మెదడు పనిచేయకుండాపోయింది. కొద్దిసేపుతరువాత తేరుకుని

"తప్పయిందని ఎందుకు ఒప్పుకుంటరా ? తప్పుచేస్తేకదా? నేనుఒప్పుకోను ఏమిచేసుకుంటరో చేసుకోపోండ్రి...." అని కుర్చిలోంచి లేచాడుదొర

వెంటనే అరడజనుమంది యువకులు అరుగుమీదికి పరుగుదీసారు. గందరగోళం ఎక్కువైంది. కొట్టుండ్రి, తన్నుండ్రి, గుద్దుండ్రి, బయటకు గుంజుండ్రి అన్న కేకలతో ఆ కాంపౌండ్ నిండిపోయింది.

కాని ముందుగా అనుకున్నప్రకారం జీతగాళ్ళు, కావలిముత్యాలు మల్లిగాడు మరిఇద్దరు దొరనువిడిపించేందుకు ముందుకు రాబోయారు యువకులు అడ్డుపడి బరిసె కర్రిలాక్కొని కర్రిలనువిరిచేసి బయటకు తీసుకపోయి కొంతమంది వాళ్ళనుపట్టుకుని అక్కడేవున్నారు. మిగతాజనం అంతా ఎవరికి తోచినట్టు వాళ్ళు తిడుతూ, శాపనార్థాలుపెడుతూ వున్నారు. అరుగుపైజనం ఎక్కువైయారు. కర్రిలు ఎక్కువగా కన్పిస్తున్నాయ్.

దశరథరామిరెడ్డి పుట్టిపెరిగిననుంచి ఇలాంటిదినాన్ని చూడలేదు. ఇంతధైర్యం ప్రజలకుంటుందని అనుకోలేదు. ఎప్పుడూ కుక్కినపేనుల్లా పడివుంటారనుకున్నాడు. ఆ కేకలు, అరుపులు, కర్రిలు, మొఖాలు, చూపులు చూసేసరికి చెమటలు పట్టాయి. దాంతో ప్రాణభయం ఎక్కువైంది. ఆదుకునేవారు ఎవ్వరూలేరు. పంతాలని వదిలిపెట్టి తప్పయిందని ఒప్పుకుంటేనే ప్రాణందక్కేట్టువుందని గ్రహించి, క్షమాపణ చెప్పుకునేందుకు మానసికంగా సిద్ధమయ్యేసరికి మొఖంలో కళ పూర్తిగా

లేకుండాపోయింది. ఆ దొరదర్పం నశించిపోయింది. ఆ అహంకారం, అధికారం నల్లగామాడిపోయి మొఖంమీద తేలిపోయాయి.

ఇంకా ఎక్కువమంది అరుగుమీదికి రాకముందే

"సరే తప్పయిపోయింది. ఇంకముందు ఎవర్నికొట్ట" అని జేబులోంచి ఇరవై రూపాయల నోటుతీసి మైసయ్యచేతిలోపెట్టి, కళ్ళల్లో నీళ్ళుతిరుగుతుండగా ఇంట్లోకి పోయాడు దొర దశరథరామిరెడ్డి. తరతరాలనుంచి ఎప్పుడూ తప్పయిందని తాము ఒప్పుకోవడమేగాని, దొరవారు యింతవరకు ఏరోజు ఒప్పుకోలేదు. కాని ఈ రోజు ఒప్పించేట్టు చేశామన్న ఉత్సాహంతో, సంతోషంతో యువకులు ఈలలువేస్తూ ముసలివాళ్ళు నవ్వుకుంటూ, స్త్రీలు ముక్కులమీద వేలేసుకుంటూ, బరిబాతల పిల్లలు ఆడుతూ దొర బంగ్లగేటుదాటారు.

అప్పటికి తొలికోడికూసి రెండు జాముల పొద్దయింది. ఎండమెరుస్తూవుంది. ఆ గుంపులో తిరిగి బాలమ్మనే ముందునడుస్తూవుంది కొడుకుసహాయంతో.

---

## మనవి

విప్లవ రచయిత చెరబండరాజు 'గంజినీళ్ళు' అనే నాటిక రాతప్రతి ఎక్కడా దొరకలేదు. చెర ఎవరికో మిత్రులకి ప్రదర్శన కోసం ఇచ్చాడు. ఈ రాతప్రతి ఎవరిదగ్గరఉన్నా దయచేసి సంగ్రామ్ : ఎల్. బి.యస్. నగర్, చీరాల. కు పంపవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

త్రిపురనేని మధుసూదనరావు
కార్యదర్శి
విప్లవ రచయితల సంఘం.

---

## 'బతుకుపోరు'

"నాకు ఇల్లూవాకిలీలేదు. పెళ్ళయిందిగాని మొగుడొదిలేశాడు. ఒంటరిదాన్ని, నాకెన్నేళ్ళో నాకే తెలీదు. నాకుతెల్సిందల్లా పొగాకుఒక్కటే. బీడీలుచుట్టి బతుకువెళ్ళ మారుస్తున్నా. పాటులేకపోతే పస్తే" నంటోంది, ఒళ్ళంతా ముడతలుపడ్డ ముసలవ్వ చంద్రిపాటిల్. కర్ణాటకరాష్ట్రంలో నిపాని అనేవూళ్ళో బీడీకూలి. వాళ్ళస్థితిగతులను కళ్ళకుకడుతూ ఓ డైరీవేశారు బొంబాయి మహిళాసమాఖ్యవారు. Reaching out అనేపేరుతో.

కర్ణాటకలో అయినా కరీంనగర్‌లోఅయినా బీడీకూలీలజీవితం ఒక్కటే. ఆ మాటకొస్తే ఎక్కడైనా ఒకటే. బీడీకూలీలు ఆడవాళ్ళు. వాళ్ళజీవితాల్లో ఒకరిజీవి చిత్రించేనవల 'బతుకుపోరు'. ఆ బతుకులకు అద్దంపట్టే ప్రయత్నమిది.

లక్ష్మిపెనిమిటి షావుకారు గుమస్తా. ఆమెజీవితం బీడీలపనితో ముడిపడి వుంది, ఉదయం నిద్రలేచిందిమొదలు రాత్రి పొద్దుపోయేవరకు ఏపనిచేస్తున్నా (ఆఖరికి బిడ్డకి పాలిస్తున్నాగాని) దానిలో అంతర్భాగంగా బీడీలపని సాగుతూనే వుంటుంది, "మాటాముచ్చట సుఖం దుఃఖం అన్నీ పనిచేసుకుంటూనే" అంటూ తనబతుకు 'రికాంలేనిబతుకాయె'నని 'కళ్ళల్లోకి ఉబికిన కన్నీరు లోపలికేలాక్కొని' కొనసాగిస్తుంటుంది లక్ష్మి.

అయితే ఈ నవలలో మధ్యతరగతి (lower middle class) జీవితంకన్నా అట్టడుగు కూలిబతుకు చూపించితే బాగుండేది.

కథలో కథనంవుంటుంది. నవలలో వర్ణనవుండాలి. అంటే narration కాక description కావాలి. [illegible] ఎదురయ్యే సంఘటనలను మరికొన్ని ఏర్చి కూర్చివుండే నిండుదనంవచ్చేది నవలకు. ఉదాహరణకు పొరుగింటి సుగుణ పెళ్ళిసంబంధం. కట్నంఎక్కువడిగారని "బీడీలకంపెనీ సేకర్లగూడ గంట గంట కట్నాలుగావాల్నా? ఇంకనాల్గుదొర్కితే సర్కారునౌకరోడు దొరకడా?" అంటుందిలక్ష్మి.

"ఇంకోరూపాయి ఎక్కువిస్తే యింకామంచివరుడు దొరుకడా అన్నట్టుగా చాలా సాదాసీదాగా అందిలక్ష్మి." అని రచయిత వ్యాఖ్యానించడం బాగానేవుంది. కాని నాటకంలోలాగ డైలాగ్స్‌తో కథనడిపించక సంఘటనలను వర్ణించడం నవలకు ప్రమాణకరం.

'అని మొద్దారం రంప'

ఆ సంఘటన ముగిస్తేసరిపోయేది, రచయిత "ఏదియాంత్రికతో ఏది వ్యక్తిగత అవసరమో తేడాతెలీసంతగా...." అని వ్యాఖ్యానించనక్కర్లేదు, దీని అవసరంలేకుండానే చిత్రణవల్లనే పాఠకులకు ఆ అభిప్రాయం కలుగుతుంది.

ఏజంటు ఆడకూలీమీద అఘాయిత్యంచేయడం, తగినశాస్తి జరగడం- చాలా సున్నితంగా చెప్పడంలో రచయితనేర్పు, ఒడుపుకనిపిస్తాయి.

'తిరగబడి తీరందే జరుగుబడిలేదురా' అన్నట్టే 'మర్రివడుతేనే భయపడుతరు. లేకపోతే గోసిలేసుకపోతరు' అనే స్పృహకలిగాకే పోరుకుసిద్ధమయారు బీడీకూలీలు.

కూలీలనాయకులుగా రాములక్క, కొంతమేరకు నారాయణ అనుభవంనుంచే రూపొందారుకాని ఆ పరిణామం ఎలావచ్చిందో చూపలేదు రచయిత. రైతునాయకుడిని పోలీసులు హత్యచేయడం నవలలో సూచింపబడిందిగాని, పోరు, దాని ప్రభావం ఎక్కడాకనిపించదు.

"ఆకు తుట్టిపోయిందని పైసలు కోసుకుంటాండు" ఏజంటు. ఏనాటినుండో యిది జరుగుతున్నా. 'ఇంకానా ఇకపైసాగదు' అంటూ ఆడకూలీలు 'కోసుకుంటే పైసలు ముట్టుకోం' అని ఎదురుతిరిగారు. విభజించిపాలించే విధానాన్ననుసరించి ఏజంటు ఇంటింటికీవెళ్ళి పైసలు బట్వాడాచేస్తాడు. మర్నాడు ఎవరికివారు విడివిడిగా పైసలపొట్లాలు బీడీకట్టలతోపాటు ఏజంటుకిచ్చేస్తారు. ఈరకం సహాయనిరాకరణకు ఏజంటు దిమ్మదిరిగిపోతాడు అతన్ని నిలదీసి ప్రశ్నిస్తారుకూలీలు. ఈలోగా ట్రేడ్ యూనియన్ లీడరు తగువుతీర్చను రంగప్రవేశం చేస్తాడు. ఏదో సర్దబోతాడు.

'మమ్ములను ఏకాడికో ఓకాడికి ఒప్పిత్తె బరండిషాపుల యింత ఉచ్చపోపిత్తడుగాదు రాజేశన్న (ఏజంటు)' అని కడుపుమంటకొద్దీ అడుగుతారు పోరాడే మహిళలు. అతని నిజస్వరూపం వాళ్ళకనుభవమే.

'కోట్లు సంపాయించెటోల్లమీదె మనతడాఖ సూపియ్యాలెగని గీ రాజేశంమీద జూపిస్తే ఏమొస్తది? అతనుకూడ మనలాగె కష్టపడేటోడెగదా' అనిలీడరు సమాధాన పర్చబోతే అతన్ని, అతని రాజకీయాలను తూర్పారబట్టి,

'మమ్ములమంచెటోడు మనతీర్గ కట్టపడెటోడెట్లైతడు?' అని అడిగి కూలీలందరు సమ్మెకట్టి వీధిలోకొచ్చేస్తారు.

'ఆడోల్లకింత పట్టింపిదేం రోగం' అని కొందరు ఆశ్చర్యపోయినా, 'పొనయ్యో కష్టపడెటోల్లంటె సచ్చేదాకతంతరు' అని సానుభూతి చూపిస్తారు మరికొందరు. బీడీ ... తారు.

"సమ్మె ఉదయభానుడి లేతకిరణాల స్థాయినుండి తీక్షణస్థాయికి, భరించలేని ఎండస్థాయికి చేరుకుంది".

అయితే తిరగబడేందుకు తగినపరిస్థితులున్నా తిరగబడే చైతన్యం వచ్చినతీరు స్పష్టంగాలేదు. వాళ్ళని సరైనమార్గాన నడిపిననాయకుడిగురించి, రంగుమార్చకుండా దిక్కుమార్చిన దగుల్బాజీ లీడరుగురించి మరింత వివరించివుంటే పోరు చిత్రణ యింకాబలంగా వుండేది.

రచయిత మాండలికం చక్కగావాడారు. ఆ జీవితమూ, మాండలికమూ తెలియని వారు కొంచెంఓపికపట్టి చదివితే అది మన కళ్ళక్కట్టినట్లగుపిస్తుంది.

బతుకులాగే పోరునికూడా ప్రతిభావంతంగా చిత్రించివుంటే ఇది గొప్పనవల అయేది. విప్లవసాహిత్యంలో తగినన్నినవలలులేవు. ఈ లోటుని ముందు ముందు బి. ఎస్. రాములుగారు తీర్చగలరనే నమ్మకం కలిగిస్తోందీ 'బతుకుపోరు'.

— కృష్ణాబాయి

---

బతుకుపోరు - నవల - బి. ఎస్. రాములు, కరీంనగర్ బుక్‌ట్రస్ట్ ప్రచురణ (జూన్ 1982) పేజీలు 112 + viii, 1/8 క్రౌన్, అయిదురూపాయలు, ప్రతులకు: సృజన, హనుమకొండ, 506001, లేదా పీస్‌బుక్‌సెంటర్, 4-5-421, సుల్తాన్ బజార్, హైదరాబాద్ 500 001.

# ఒంటరి సైనికుడు

(బ్రౌన్ జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు. కడప జాబుల సంకలనం. సంశోధన : 'బంగోరె', పర్యవేక్షణ : జి. ఎన్. రెడ్డి. 10 రూ.)

ప్రాచీన భారత చరిత్రకు సంబంధించి అప్పటివారు అసంకల్పితంగా పురావస్తు ఆధారాలను వదలిపోవటం, అదే విధంగా కొన్ని పౌరాణికాది గాథలను ప్రచారంలో పెట్టడం తప్ప, చారిత్రిక దృష్టితో నమోదు చేసింది అతిస్వల్పమని గట్టివిమర్శ ఒకటుంది. ఈ విమర్శలోని తప్పొప్పుల సంగతి అట్లాఉంచి, చరిత్ర ప్రాధాన్యం గురించి ఇంతగా తెలిసిన తర్వాత సైతం మన విశ్వ"విద్యా"లయాలకు, "చరిత్రకారు"లకు ఏర్పడిన చారిత్రిక దృష్టి ఎంత అని ప్రశ్నించవలసిన అవసరంఏర్పడింది.

చరిత్ర రచన ప్రస్తుతం మూడు అంశాలపై ఆధారపడి సాగుతున్నది. అవి పురావస్తు విశేషాలు, లిఖిత ఆధారాలు, మౌఖిక కథనాలు. ఈ రచన ప్రధానంగా నాలుగు స్థాయిలలో జరుగుతున్నది. అవి దేశచరిత్ర, ప్రాంతచరిత్ర, స్థానికచరిత్ర వ్యక్తిచరిత్ర. అయితే ఇవి పరస్పర సంబంధం లేనివికావు. లిఖితపూర్వక ఆధారాలు లేనపుడు మాత్రమే చరిత్ర పరిశోధన కేవలం పురావస్తు విశేషాలపై ఆధారపడుతుంది. అట్టి ఆధారాలు లభించే స్థితిలో ఒకదానికొకటి ఆలంబనం అవుతాయి. పురావస్తు విశేషాలపై మాత్రమే ఆధారపడి చరిత్ర రాయవలసిన పరిస్థితి వెయ్యేళ్ళ క్రితం కాలానికి సంబంధించి ఎక్కువగా ఉంది, తర్వాత నుండి స్థూలంగా రెండవదశ మొదలవుతుంది. ఇక మౌఖిక సంప్రదాయంలో తరతరాలుగా కొనసాగుతూవస్తున్న సాహిత్యాధారాలను అట్లా ఉంచితే, ప్రత్యక్ష కథనాలు ఇప్పుడు జీవించిఉన్న ఇటీవలి రెండుమూడు తరాలకు పరిమితమై చరిత్ర రచనకు మౌఖిక ఆధారాలుగా ఉపయోగిస్తాయి. ఈ రెండు, మూడు తరాలకాలపు లిఖిత ఆధారాల దృఢీకరణ - నిరాకరణలకు, ఇట్టి ప్రత్యక్ష కథనాలు చాలా విలువైనవి. ఉదాహరణకు తెలంగాణా సాయుధ పోరాటాన్ని దృష్టిలోపెట్టుకుని ఆలోచిస్తే, ఈ విషయం సులభంగా బోధపడుతుంది.

తెలుగుదేశానికి సంబంధించి, నాకు తెలిసినంతవరకు, మౌఖిక చరిత్రలు లేవు. పురావస్తు ఆధారాల సంగతి అట్లాఉంచితే, లిఖిత ఆధారాలకు సంబంధించి మన చరిత్ర పరిశోధన- అభిలేఖాగారాల (ఆర్కైవ్స్)లోని మెకంజీ రికార్డులనుమించి అర్జీలు, ఉత్తరాలు, డైరీల వంటి వ్యక్తిగత పత్రాల వరకుగాని, వివిధ సంస్థలు, వ్యక్తులవద్ద నిక్షిప్తమై ఉండే పత్రాలవరకుగాని అరుదుగా తప్ప పోవడంలేదు. ఇందుకు అనుగుణంగానే మనకు, మతవిషయ భూయిష్టమైన స్థలపురాణాలను మినహాయించి స్థానిక చరిత్రలు అనదగ్గవి అతికొద్ది.

ఈ విధంగా వైశాల్యం తగ్గిన ఆంధ్రదేశ చరిత్ర పరిశోధనకు, ఎత్తు - లోతు కూడా తగ్గాయి. తీవ్రశోధనలేని రచనాకృషికి పరిధిసైతం సంకుచితం కావడం సహజమేగదా. ఎందుకీ పరిస్థితి అన్న జిజ్ఞాస, అసలు చరిత్రను పరిశోధించేదెవరు అధ్యయనం చేసేదెవరు అన్న మౌళిక ప్రశ్నలను రేకెత్తిస్తుంది.

"చరిత్ర చదవడం ఎందుకు సార్ ?" అన్న ప్రశ్నవేస్తే మన యూనివర్సిటీ బ్రాండ్ డిగ్రీ చరిత్రకారుల్లో సమాధానం కోసం తడుముకోని వాళ్ళెందరు? అభివృద్ధి కాముకులుకావచ్చు, లేదా అభివృద్ధి నిరోధకులు కావచ్చు- చరిత్ర ప్రయోజనాన్ని గుర్తించి దానిపట్ల నిబద్ధతగలవారే చరిత్రను పరిశోధిస్తారు, అధ్యయనం చేస్తారు. 'వేతనశర్మ'లైన డిగ్రీ చరిత్ర కారులకు అది ఉండకపోవడంలో వింతలేదు.

తెలుగు భాషా - సాహిత్యాలకు బ్రౌన్ చేసిన సేవలు తెలిసినవే. పోతే అధికారికంగా, అనధికారంగా ఆయనకు అందిన అర్జీలు, లేఖలు, ఆయనరాసిన జాబులనుండి 1830-52 మధ్య కడపజిల్లాకు సంబంధించిన ఉత్తరాలలో కొన్నింటి ఆధారంగా, నాలుగు అంశాల గురించిన స్థానిక చరిత్రను 'బంగోరె' ఈపుస్తకంలో రాసారు. అవి 1) ఉయ్యాలవాడ నరసింహారెడ్డి తిరుగుబాటు, 2) 'గుంటూరు కరువు'లో కడప కటకటలు, 3) సబ్ కలెక్టర్ మర్డానల్డ్ హత్య, 4) కడపలో 'బ్రౌన్ కాలేజి' బంగళా - తోట.

చరిత్ర పరిశోధనగురించి పైనచెప్పిన నేపథ్యంలో చూసినపుడు 'బంగోరె' ఈ పుస్తకరచనలో రెండు సంకుచిత వలయాలను ఛేదించారు: ఒకటి, స్థానికచరిత్ర రచనకు ప్రయత్నించడం, రెండు- ఇప్పటికే నమోదయిన చరిత్రను వ్యక్తిగత పత్రాలవెలుగులో పరిశీలించడం, అంతేకాదు. చరిత్రను అధ్యయనంచేసేది దాని నుంచి పాఠాలునేర్చుకోవడానికే అనుకుంటే, ఆయాపరిస్థితులలో అప్పటిపాలకులు, పాలితుల వ్యవహారణను విశ్లేషిస్తూ ప్రస్తుతపరిస్థితులతో పోల్చడానికి 'బంగోరె' సూత్రప్రాయంగా ప్రయత్నించడం, ప్రశంసనీయమైన ఒకముఖ్యాంశం.

అయితే, సిద్దాంతంఅంటూ ఒకటిలేని రాడికల్ పరిశోధకుడు 'బంగోరె' సిద్ధాంతంలేని రాడికలిజానికి అత్యుత్సాహం అనుపల్లవి అవుతుంది. విషయపరిశీలనలో, ప్రతిపాదనలో ఆయనలో ఈ లక్షణాలు కనిపించేదిఅందుకే.

బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ రెవెన్యూ విధానాలకు వ్యతిరేకంగా కడప మండలంలో 1845-47 కాలంలో ఉయ్యాలవాడ నరసింహారెడ్డి అనేపాళెగాడు నాయ

తర్వాత పెద్ద సాయుధతిరుగుబాటు జరిగింది. ఆ తిరుగుబాటు స్వభావాన్ని అర్థంచేసుకోవడంలో కంపెనీ ప్రభుత్వవైఫల్యం, తిరుగుబాటు అణచివేతకు వేలాదిగా సైన్యాలరప్పింత, ప్రభుత్వరికార్డుల్లో వాస్తవాల వక్రీకరణ, నరసింహారెడ్డి ఉరితీత అనంతరం ఆయనపై వీరగాథాలచన మొదలైన విషయాలను 'బంగోరె' మొదటి వ్యాసంలో వివరించారు. ఈ తిరుగుబాటుగురించి చదివినపుడు వర్తమాన వ్యవసాయిక విప్లవోద్యమాలు వెంటనే గుర్తుకువస్తాయి. కాని నరసింహారెడ్డికి సిద్ధాంతం లేదని అంగీకరిస్తూనే, ఆయనను 'ఆదిమ ఆంధ్రనక్సలైట్'గా రచయిత అభివర్ణించడం అత్యుత్సాహమేగాక చరిత్రకు విరుద్ధమైన మాట. తిరుగుబాటు అన్న ఒక్క లక్షణాన్ని తీసుకున్నప్పటికీ నరసింహారెడ్డికన్న యాభైఏళ్ళ ముందేగంజాం, గోదావరి ప్రాంతాల జమీందార్లు, ముఠాదార్లు, గిరిజనులు కంపెనీ ప్రభుత్వంపై సాయుధ పోరాటాలు ప్రారంభించారు.

లక్షలాదిమందిని బలితీసుకుని 'గుంటూరు కరువు' పేరిట దుష్ప్రసిద్ధమైన 1832-33 నాటి కాటకంలో కంపెనీ ప్రభుత్వవైఖరికీ, కరువులపట్ల 'స్వతంత్ర భారత' ప్రభుత్వ వైఖరికీ ఎంత సామ్యంఉందో మరొక వ్యాసంలో బాగా చూపారు. చుట్టూ కూలుతున్న ఆకలిశవాల మధ్య విశ్రాంతిగా కూర్చున్న తక్కిన అధికారులు- drought (కరువు) scarcity (కొరత) distress (కటకట) adverse season (అకాలం) వంటి పదాలతో ప్రభుత్వానికి నివేదికలు పంపుతుంటారు. ప్రెస్ మాత్రం దానిని famine (క్షామం) అన్నందుకు ప్రభుత్వం ఆగ్రహిస్తుంది. ఏది ఏమైనా శాంతిభద్రతలు కాపాడటం కోసం కొంత సైనికసామాగ్రిని మాత్రం హుటాహుటిన దయచేయిస్తుంది! పాలకులు - పాలితుల ధర్మానికి చరిత్రలో ఎప్పుడూ రాజ్యాంగ సవరణలు లేవుగదా మరి.

తమ వ్యాపార దోపిడీకి, రాజకీయాధిపత్యానికి మార్గం సుగమం అవుతుందన్న ఉద్దేశంతో వలసాధిపతులంతా ప్రపంచవ్యాప్తంగా క్రైస్తవ మతాంతరీకరణను ప్రోత్సహించారు. అందుకు వ్యతిరేకంగా స్థానిక ప్రయోజనాలు, విశ్వాసాల పరిరక్షణకు తిరుగుబాట్లు జరిగాయి. అప్పటి చైతన్యస్థాయి, పరిస్థితుల అనుకూలతను బట్టి అవి తరచు మతం పేరుతోసాగాయి. కడప మండలంలో సైతం ఇట్టి పరిస్థితులు ఉండేవి. ముస్లిముల చేతిలో సబ్ కలెక్టర్ మక్డొనల్డ్ వధ యాదృచ్ఛికమని స్థూల దృష్టికి తోచినా, అప్పటి సాంఘిక పరిస్థితులతోడి గతితర్కంతో పరిశీలించడానికి 'బంగోరె' చేసిన ప్రయత్నాన్ని, ఆంధ్రదేశ చరిత్రపరిశోధనలో ఇంకా మొగ్గయినా సరిగా తొడగని అభ్యుదయ దృక్పథానికి ఉదాహరణగా చెప్పుకోవచ్చు.

తెలుగు భాషా సాహిత్యాల విషయంలో బ్రౌన్ కృషి గురించి ఇప్పటికే తెలిసిన దానికి అనుబంధంగా ఉపయోగపడేది చివరివ్యాసం. 'బంగోరె'కు పరిశోధకుడిగానే కాక ఇతర పరిశోధకులు, సాహిత్యపరులపై కొరడాలు ఝళిపించే వ్యక్తిగా కూడా పేరున్నది. ఆ విధంగా మామిడిపూడి వెంకటరంగయ్య, వేటూరి, తంగిరాల, కందుకూరి వీరేశలింగం మొదలైన వారిపై ఈ వ్యాసంలో విమర్శలున్నాయి. మొదటి ముగ్గురిపై విమర్శకు ఆయన కొన్ని సమంజసమైన ఆధారాలు కూడా చూపారు. కాని, "బ్రౌన్ గతించిన తర్వాత కనీసం కృతజ్ఞతగానైనా ఆ పేరు ప్రఖ్యాతులను ఆయనకు చెందకుండా చేశారు.... కందుకూరి వీరేశలింగం వంటి ప్రఖ్యాత సాహితీవేత్తలు" అని తీవ్రమైన ఆరోపణచేసిన 'బంగోరె' అందుగురించి ఒక్క వివరణవాక్యమైనా రాయలేదు. ఈ విషయమై నేను రాసిన ఒక ఉత్తరానికి ఆయన ఈ విధంగా సమాధానమిచ్చారు.

"....వివరించలేదు స్పష్టంగా.... వ్రాయాలంటే పెద్దకథఅవుతుంది. ఉదాహరణకు ఆయనవ్రాసిన 'కవులచరిత్ర'కు ప్రేరణ, స్ఫూర్తి బ్రౌన్‌వ్రాసిన 'Essay on the language & literature of the Telugus' అనే పెద్దవ్యాసం నుంచి పొందాడు. అంతేకాదు. బ్రౌన్ సేకరించిన manuscripts పెక్కింటిని వందలాదిని బాగావాడుకొన్నాడు. వీరేశలింగం స్వీయచరిత్రలో కవులచరిత్ర వ్రాసేటప్పుడు మద్రాసు ఓరియంటల్ మానుస్క్రిప్ట్సు లైబ్రరీ (Madras Oriental Mss. Library కి వెళ్ళి దాదాపు నెలరోజులపాటు నోట్సుతీసుకుంటాడు. ఆ నోట్సు యెక్కడో బీచ్‌లోపోతుంది. పిచ్చిగావెతుకుతాడు. దొరకదు. మళ్ళీ ఆ బ్రౌన్ మానుస్క్రిప్ట్సు వ్రాసిననోట్సునే వ్రాసుకొంటాడు. యీ ప్రస్తావనమాత్రం స్వీయచరిత్రలోవుంది. కానీ ఎక్కడా బ్రౌన్ పేరు చెప్పనేచెప్పలేదు. ఎందుకు చెప్పలేదు అన్నదానికి వేరేకారణాలు ఏమున్నాయోగానీ— దాదాపు ప్రతిమానుస్క్రిప్ట్ పైన బ్రౌన్‌సంతకం, నోట్సు వగైరాలున్నప్పటికీ బ్రౌన్ పేరు చెప్పకపోవడం, ప్రస్తావనపరంగానైనా చెప్పకపోవటం అన్యాయమేనంటాను. తెలుగు సాహిత్య చరిత్ర వ్రాయాలనుకొన్న వాడెవడికైనా- ఆనాడేకాదు ఈనాడుకూడా- ప్రామాణికమైన సామగ్రిని సేకరించిపోయినవాడు బ్రౌన్. యీ విషయమై కొంతసూచనప్రాయంగా లోగడప్రకటించిన.... 'బ్రౌన్‌లేఖలు' గ్రంథంలో suggestive గా వ్రాసాను". 'బంగోరె' చేసిన ఈ ఆరోపణ ఎంతవరకు సరైనదో పరిశీలించటం అవసరం.

ఇతర రచయితలగురించి 'బంగోరె' చాలా అసహనంగా వ్యాఖ్యానించే వారన్న విమర్శ ఒకటుంది. వ్యాఖ్యలు వ్యక్తిగతంగా, ఘాటుగా ఉండనక్కర

లేదు. పరిమితులు నిర్ణయించే 'పండితులు'- పరోక్షంగా, అసంకల్పితంగా- తమ రచనాదికకృషి ఏ పరిమితిలో ఉందోకూడా తత్పూర్వకంగా సూచిస్తుంటారను కుంటాను. ముఖ్యంగా మనపరిశోధనల అధ్వాన్నతగురించి వంతచెందిన వారికి మాత్రం, 'బంగోరె' విమర్శలో తప్పుపట్టవలసింది అంతగాకన్పించదు.

పరిశోధనపట్ల 'బంగోరె'ది ఉగ్రనిబద్ధత. అయితే విషయపరిశోధనలో వివిధాంశాలను గతితార్కికంగా చూడప్రయత్నించే 'బంగోరె', అసలు పరిశోధనా ప్రక్రియను సామాజిక పురోగమనంతో గతితార్కికంగా చూడనందువల్ల ఏ సిద్ధాంతమూ పట్టనివాడయాడు. అందుకు ఆయనజీవితం, ఆలోచనాధోరణి ఏ విధంగా కారణాలయ్యాయో తెలియదుగాని, ఫలితంమాత్రం రాడికల్ పెటీబూర్జువా మేధావిగా మిగిలిపోయాడు.

బౌద్ధికంగా ఏకాకితనానికి గురయ్యానంటూ 'బంగోరె' ఆత్మహత్య చేసుకున్నాక ఒక రచయిత- మనం 'బంగోరె'ను చర్చించి, విమర్శించి నిలుపుకోలేకపోయామని ఆవేదన చెందాడు. చలం విషయంలో కూడా ఇటువంటి అభిప్రాయం ఉంది. ఇది కొంతవరకు సరైనదే. ఉద్యమాలతో కలవవలసిన బాధ్యత వ్యక్తులపై ఎంత ఉందో, వ్యక్తులను గుర్తించి తమలో కలుపుకోవలసిన బాధ్యత ఉద్యమాలపై కూడా అంత ఉంది. 'బంగోరె'కు సంబంధించి రెండూ జరగలేదు.

తా.క. : ఈ పుస్తకపరిశోధన, ప్రచురణ ఎస్.వి. యూనివర్సిటీ వారి బ్రౌన్ ప్రాజెక్టులో భాగంగా జరిగింది. ఆ ప్రాజెక్టును వారు తమ "మురికి రాజకీయాల" కారణంగా రెన్యూ చేయలేదని, అందువల్ల పరిశోధన కొనసాగలేదని వినికిడి. ఇందు గురించి నిజానిజాలు వెల్లడికావాలి, ప్రాజెక్టును అసలు ప్రారంభించడమంటూ చేసినప్పటికీ అందుకే వారిని అభినందించడం లేదు.

— టంకశాల అశోక్

---

# పౌరహక్కుల సంఘం దృక్పథం, పరిధి.

పౌరహక్కులసంఘం కార్యకలాపాలగురించి ఈమధ్య చాలఅనుమానాలు ప్రశ్నలు, ఆరోపణలు వినవస్తున్నాయి. పౌరహక్కులు నక్సలైట్లకేనా అని కొందరు, పౌరహక్కులకు పోలీసులుమాత్రమే శత్రువులా, అని కొందరు ప్రశ్నిస్తున్నారు. తాము గుండాలను, ఇతర సంఘవ్యతిరేక శక్తులను, శిక్షించాలని కృషి చేస్తోంటే పౌరహక్కులసంఘం అడ్డువస్తోందని పోలీసులంటున్నారు. అధికారులు అధికారదుర్వినియోగం చేస్తున్నారని పౌరహక్కులసంఘం ఆరోపిస్తే, మరి అధికారం లేనివాళ్ళుమాత్రం తమవిధులు సక్రమంగా నిర్వహిస్తున్నారా అని ఆ అధికారులు, ఎదురుప్రశ్న వేస్తున్నారు. వాళ్ళ విషయంకూడా మీరెందుకు పట్టించుకోరు అని నిలదీస్తున్నారు. ఈరకం ప్రశ్నలవెనకఉన్నది అమాయకత్వమే అయినా కాకున్నా సమాధానం చెప్పాల్సిన బాధ్యత పౌరహక్కులసంఘంమీదఉంది.

మనది చాలా పేదదేశం. మనదేశంలో దాదాపు 30 కోట్లమందికి రోజూ రెండు పూటలా భోజనందొరుకదు. 40 కోట్లమందికి అక్షరజ్ఞానంలేదు. పట్టణ ప్రాంతాలలోని 12కోట్ల జనాభాలో 2 కోట్లమంది నమోదైన నిరుద్యోగులు. గ్రామాలలో పేద రైతులు, వ్యవసాయకూలీలు, ఒకపూటగడిస్తే ఒకపూట గడవని పరిస్థితిలో బ్రతుకుతున్నారు. కూలి దొరికిననాడు అయిదో, ఆరో రూపాయలు కూలిదొరుకుతుందిగాని, సంవత్సరంలో 200 రోజులకంటె ఎక్కువకూలి దొరకదు. పట్టణాలలోని రిక్షావాళ్ళు, హమాలీలు తదితర అసంఖ్యాకులయిన అసంఘటిత శ్రామికులు పేదరైతులకంటె మెరుగయిన బ్రతుకులేం బ్రతకడంలేదు.

ఇటువంటి పరిస్థితులలో ప్రజలు తమబ్రతుకులు బాగుపరచుకోవడం కోసం పోరాడడంసహజం. సమ్మెలు, ధర్నాలు, ఊరేగింపులు, సభలు, ఇంకాఎన్నో రూపాలలో పోరాటాలుచేస్తారు. ఈ పోరాటాలకు రకరకాల రాజకీయాలుంటాయి. ఆ రాజకీయాలతో పౌరహక్కుల సంఘానికి నిమిత్తంలేదు. పౌరహక్కులసంఘం సభ్యులైనవారికి వారివారి అభిప్రాయాలు ఉండవచ్చు. తమ జీవితాలను బాగుపరచుకోవడంకోసం పోరాటాలు నడిపేహక్కు ప్రజలకుఉందని గుర్తించడం ప్రధానం. అంతేగాని ఆ పోరాటాల మంచిచెడ్డలు పౌరహక్కులసంఘం నిర్ణయించదు.

అయితే ఆ పోరాటాలు సాగాలంటే - అంటే ఈదేశప్రజలు తమజీవితాలను బాగుపరచుకోవాలంటే - ప్రజలకుకొన్ని కనీస పౌరహక్కులు, ప్రజాస్వామిక హక్కులు అవసరం. భావప్రకటనా స్వాతంత్ర్యం, సభాస్వాతంత్ర్యం, ప్రచార అవకాశాలు ఉండాలి. వివిధరూపాలలో నిరసనతెలిపే హక్కుఉండాలి. ఈ హక్కు

లేవీ మనరాజ్యాంగం నిర్ద్వంద్వంగా గుర్తించదు. ఒకచేత్తో ఈ హక్కులిస్తూనే మరొకచేత్తో లాక్కోవడానికి కావలసినఏర్పాట్లు మన రాజ్యాంగంలో వున్నాయి. అందుకోసమే వీటికోసం నిరంతరం పోరాడాల్సిన అవసరంవుంది. అదే పౌర హక్కులసంఘం ప్రధానకర్తవ్యం. జాతీయ భద్రతాచట్టం, అత్యవసర సర్వీసుల చట్టం, కల్లోలిత ప్రాంతాలచట్టం, బీహార్ ప్రెస్‌చట్టం, తదితర నల్లచట్టాలకు వ్యతిరేకంగా పౌరహక్కులసంఘం అందుకే ఉద్యమించింది.

అయితే మనదేశ పరిస్థితులలో పౌరహక్కుల సంఘం బాధ్యత ఇంతటితో ఆగిపోవడంలేదు. సమాజంలోని పెత్తందార్ల మీద, వాళ్ళతో కుమ్మక్కయ్యే అధికార్ల మీద, నిఘా ఉంచాల్సిన అవసరం ఏర్పడుతోంది. ఎందుకంటే, ప్రజలు చైతన్యవంతులయ్యేకొద్దీ ప్రభుత్వ అధికార్లు, పెత్తందార్లు, చట్టాన్ని పక్కకుపెట్టి ప్రజలను హింసాత్మకంగా అణచడం ఎక్కువ అవుతుంది. కాబట్టి నల్లచట్టాలకు వ్యతిరేకంగా ఉద్యమించడమే కాకుండా, ఉన్నచట్టాలను నిష్పాక్షికంగా అమలు చేయాలని డిమాండు చేయాల్సివస్తోంది. ప్రజలు చట్టాన్ని ఉల్లంఘిస్తే ఏ విధంగా శిక్షార్హులో అదే విధంగా అధికారులు, పోలీసులు, ఆస్తిపరులు, కూడ శిక్షార్హులు కావాలి. సామాన్య ప్రజలు చేస్తే నేరమయినది, పోలీసులో లేక ఘరానా వ్యక్తులో చేస్తే క్షంతవ్యం కాకూడదు. ఇటువంటి వాతావరణం దేశంలో ఏర్పడకపోతే ప్రభుత్వానికి ప్రత్యేకమైన నల్లచట్టాలు అనవసరం. ఉన్న చట్టాన్ని పక్కకుపెట్టి తుపాకితోనే ప్రజలను అణచగలదు. అటువంటి వాతావరణం ఏర్పడేటట్లు చూడడం కూడ ఇవాళ పౌరహక్కుల సంఘం బాధ్యత అయింది.

దేశంలో అందరు కూడ తమతమ విధులు సక్రమంగా నిర్వహించేలాగ చూడడం పౌరహక్కుల సంఘం కర్తవ్యం కాదు. గుమాస్తాలు, బడిపంతుళ్లు, ఆస్పత్రులలో నర్సులు, ఆర్. టి. సి, డ్రైవర్లు తమ విధులు సక్రమంగా నిర్వహించకపోతే శిక్షించడానికి వారిపై అధికార్లు ఉన్నారు. అపై అధికార్లు తమ అధికారాన్ని దుర్వినియోగంచేసి తమ క్రింది వాళ్ళపై అత్యాచారాలకు పాల్పడినా, లేక తమ విధులు సరిగ్గా నిర్వహించకపోయినా, వాళ్లు గూడ శిక్షించబడేటట్టు చూడడం పౌరహక్కుల సంఘం కర్తవ్యం. ఒక విద్యార్థి మరొక విద్యార్థిని కొట్టినా పొడిచినా హత్యచేసినా ఖండించడం పౌరహక్కుల సంఘం కర్తవ్యం కాదు. ఎందుకంటే అతన్ని శిక్షించేందుకు పోలీసులు, కోర్టులు యావత్ శిక్షావ్యవస్థ (Penal System) ఉన్నాయి కాబట్టి. కాని పోలీసులే 'ఎదురుకాల్పుల' పేరిట హత్యలుచేస్తే ఆ పోలీసులను కూడ శిక్షించాలని డిమాండు చేయడం పౌరహక్కుల సంఘం కర్తవ్యం అవుతుంది. రెండు

పార్టీలుగాని బృందాలుగాని కలహించుకొని పరస్పరం హింసాకాండకు గురిచేసుకుంటే ఖండించడం పౌరహక్కుల సంఘం బాధ్యత కాదు. ఎందుకంటే వారిలో ఎవరు ఎంత మేరకు దోషులో నిర్ణయించి శిక్షించేందుకు చట్టం ఉంది కాబట్టి. ఆ చట్టాన్ని సంరక్షించాల్సిన పోలీసులు కలహంలో ఒకరిపక్షం తీసుకొని రెండవ పక్షం మీద దాడిచేస్తే దాన్ని అధికార దుర్వినియోగంగాను, శాసన అతిక్రమణగాను ఖండించడం పౌరహక్కుల సంఘం కర్తవ్యమవుతుంది. గిరిజనులు గుడుంబా కాచుకొని తాగినా అమ్మినా అక్రమమని ప్రకటించడం పౌరహక్కుల సంఘం పనికాదు. ఎందుకంటే అందుకోసమే కోట్లరూపాయలు ఖర్చుచేసే ఎక్సైజ్ శాఖ ఉంది కాబట్టి. కాని ఆ ఎక్సైజ్ శాఖవారు గిరిజనులను చట్టరీత్యా శిక్షించకుండా, సారా కాంట్రాక్టర్లతో మిలాఖతై వాళ్ళ మీద దాడులు జరిపి లంచాలుగుంజి స్త్రీలను అవమానపరిస్తే ఖండించడం పౌరహక్కుల సంఘం కర్తవ్యం అవుతుంది. కార్మికులో విద్యార్థులో సమ్మెచేస్తే అది దేశానికి నష్టదాయకమని వ్యతిరేకించడం పౌరహక్కుల సంఘం కర్తవ్యం కాదు. ఎందుకంటే తమ బ్రతుకులు బాగుపరుచుకోవడం కోసం సమ్మె చేసే హక్కు వాళ్ళ ప్రజాస్వామికహక్కు కాబట్టి. కాని సమ్మెలను నిషేధించడం కోసం ప్రభుత్వం ESMA వంటి చట్టాలను ప్రవేశపెడితే అది ప్రజాస్వామ్యానికి వ్యతిరేకమని ఖండించడం పౌరహక్కుల సంఘం కర్తవ్యమవుతుంది.

మన దేశంలో ఒక చట్టంవుంది. ఒక రాజ్యాంగం, శిక్షాస్మృతి. ఉన్నాయి. ఇవి అమృతమయినవని, ఇంతకంటే గొప్పచట్టం ఉండబోదనీ, ఎవ్వరూ అనరు. నిజానికి లోపాలేలేని చట్టాలంటూ ఏవి ఉండవు. కాబట్టి తమ బ్రతుకులు బాగుపరచుకోవడం కోసం పోరాడే క్రమంలో ప్రజలు ఈ చట్టాన్ని తరచు ఉల్లంఘిస్తూ ఉంటారు. ఆ ఉల్లంఘన మంచిదా కాదా అన్నప్రశ్న పౌరహక్కుల సంఘానికి అనవసరం. ఎందుకంటే అందుకు శిక్షించడానికి ప్రభుత్వము, పోలీసులు కోర్టులు, జైళ్లు ఉన్నాయి కాబట్టి. కాని ఆ ప్రభుత్వమే, ఆ పోలీసులే, సమాజంలోని వివిధ పెత్తందారులే, చైతన్యవంతులైన ప్రజలను అణచడానికి [illegible]గా చట్టాన్ని ఉల్లంఘిస్తున్నారు. ఒక్కోసారి కేవలం తమ జేబులు నింపుకోవడం కోసం కూడ ఉల్లంఘిస్తూంటారు. అట్లా ఉల్లంఘించినప్పుడు వాళ్ల గూడ శిక్షార్హులేనని, డిమాండు చేయడం మా కర్తవ్యం అవుతుంది. అంతేగాని చట్టాన్ని ఉల్లంఘించే వాళ్ళను శిక్షించవద్దని మేము అనడంలేదు. ఈమధ్య ఇచ్చిన ఒక పత్రికాప్రకటనలో వరంగల్ జిల్లా ఎస్. పి. అన్నట్టు, సంఘవిద్రోహ శక్తులను అరెస్టు చేస్తూంటే మేము అడ్డురావడంలేదు. దానికొక పద్ధతిలేదా అని మాత్రమే అడుగుతున్నాము. విద్యార్థులు నిజం

గానే బాంబులు తయారుచేస్తుంటే అది పోలీసుల కట్టుకథ కాకపోతే (అది ఎంతటికట్టుకథో గౌరవనీయులైన ఎస్.పి. గారికే అందరికంటే బాగాతెలుసు) వాళ్ళను అరెస్టు చేయండి, Explosive Act క్రింద శిక్షించండి, ఎవరు కాదనడం లేదు. కాని దానికి కాలేజిమీద దాడిచేసి, విద్యార్థులను చితకబాది, క్లాస్ రూంలోకి తరిమి తరిమి కొట్టమని చట్టంలో రాసివుందా? ఆ పనే వేరెవరైనా చేస్తే ఊరుకుంటారా? నిందితులు సాయుధులయినప్పుడు గూడ వాళ్ళమీద minimum force ప్రయోగించాలని చట్టం అంటుంది. చేతిలో పోస్టర్లు తప్ప వేరే ఏ ఆయుధము లేని విద్యార్థుల మీద లాఠీలు ప్రయోగించడం ఏచట్టం క్రింద ఆమోదనీయం? పోలీసులు తమ పరిశోధనలో భాగంగా ఇళ్లసోదా చేయకూడదని మేము అనడంలేదు. కాని దానికి సర్చి వారంటు తెచ్చుకోవాలి. ఆ పని స్త్రీలను బూతులు తిట్టడం అనీ, కనబడ్డ వస్తువులన్నింటినీ అపహరించడం అనీ ఏ చట్టం అంటుంది.

నిజానికి ఈ విషయాలన్నీ ఎస్.పి.కి తెలియకకాదు. తెలిసి మా మీద ఆరోపణవేస్తారు. దానికొక కారణం వుంది. వరంగల్‌లో గత ఆరునెలలుగా నడుస్తోన్న పోలీసు రాజ్యానికి వ్యతిరేకంగా ఒక్క పౌరహక్కుల సంఘమే నోరు మెదిపింది. వేరే ఏ సంస్థగాని పార్టీగాని పట్టించుకోలేదు. కాబట్టి, మా గురించి దుష్ప్రచారం చేస్తేనేగాని తమ అత్యాచారాలు కొనసాగవనే పథకంతో పోలీసులు ఈ వక్రీకరణలు చేస్తున్నారు. ఆ పథకంలో భాగంగానే మా సంఘ సభ్యులు నలుగురిమీద అబద్దపు కేసుపెట్టారు. ఆ నలుగురిలో ఇద్దరు ఆనాడు వంగల్‌లో లేరన్న వాస్తవాన్ని మేము పత్రికలకు తెలియజేసే సరికి భయపడి ఎస్.పి. మొన్నటి పత్రికాప్రకటనలో మళ్ళీ పచ్చి అబద్ధం చెప్పాడు.

పౌరహక్కులు, ప్రజాస్వామికహక్కులు సాధించుకోవడానికి ప్రజలు మా లక్ష్యాన్నీ వాస్తవాలనూ, అర్థంచేసుకొని మాతో సహకరిస్తారని ఆశిస్తాము.

[30-1-83 మధ్యాహ్నం జరిగిన వరంగల్ జిల్లా పౌరహక్కుల సంఘం సర్వ సభ్య సమావేశంలో రాష్ట్ర పౌరహక్కుల సంఘం కార్యవర్గ సభ్యుల సమక్షంలో చర్చించబడి ఆమోదించబడిన వివరణ.]

**SRJANA Telugu Monthly** February 83 H/WL-10
Regd. No. with Registrar of New5papers 10953/67

